శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక- 24

29-12-2023



ఉళగళంద పెరుమాళ్, కాంచీపురం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ౹ూగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

విషయ సూచిక

పురాణాల కంటే ఇతిహాసాలకు కల ప్రాబల్యమ్..........................................5

ఆళ్వారులు దర్శించిన గరుడసేవ........................................................ 16

శ్రీవిష్ణుపురాణంలోని ఖాండిక్య కేశిధ్వజసంవాదం...................................... 26

ద్రౌపది శరణాగతి ........................................................................... 50

పెరియవాచ్చాన్ పిళ్ళై వైభవం........................................................... 53

శ్రీవిష్ణుపురాణప్రామాణ్యం................................................................ 61

సంచయేచ్ఛ- సంచితేచ్ఛ................................................................ 74

తులసి అంటే ఏమి? ....................................................................... 78

వేదాన్ని ద్రావిడీకరించిన ఆళ్వారులు- ద్రావిడవేదభాష్యకారులు.................... 81

ఆళ్వారులు కొనియాడిన ద్రావిడభాషావైభవం........................................ 100

# పురాణాల కంటే ఇతిహాసాలకు కల ప్రాబల్యమ్

మహాభారతంలో–

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరేదితి"

ఒక ప్రసిద్ధమైన శ్లోకం ఉన్నది. "వేదాలలోని అర్థాలను నిర్ణయించేసి చెప్పేటప్పుడు, ఇతిహాస పురాణాల సహాయంతోనే వేదాల అర్థనిర్ణయాన్ని చేయాలని, ఆ విధంగా ఇతిహాస పురాణాల జ్ఞానం లేకుండా, వాటి సహాయాన్ని గ్రహించకుండా వేదార్థ నిర్ణయాన్ని చేసే అల్పశ్రుతుని చూచి వేదం "వీడు నన్ను మోసగిస్తాడు "అని భయపడుతుంది"– అని ఈ శ్లోకం తెలుపుతున్నది.

ఈ విధంగా వేదార్థ నిర్ణయాన్ని చేసే ఇతిహాసాలు, పురాణాలు అనే రెండిటిలో, పురాణాల కంటే ఇతిహాసాలకు కల గొప్పతనాన్ని గూర్చి శ్రీపిళ్లైలోకాచార్యులవారు శ్రీవచనభూషణ దివ్యగ్రంథంలో "ఇవై ఇరండిలుమ్ వైత్తుక్కొండు ఇతిహాసమ్ ప్రబలమ్, అత్తాలే అదు ముట్పదు"(ఈ రెండిటిలోనూ ఇతిహాసం ప్రబలమైనది, అందువల్ల అది రెండిటిలో ముందు చెప్పబడుతున్నది) అని అన్నారు. అందువల్ల ఇతిహాసాలు, పురాణాలు అనే రెండిటిని గమనించినప్పుడు, పురాణాల కంటే, ఇతిహాసాలకు ప్రాబల్యం, ప్రామాణ్యం అధికం.

సంస్కృత భాషలో "అల్పాచ్ తరం పూర్వమ్"అనే ఒక న్యాయం ఉన్నది. సహజంగా, సమాసంలో ఉండే రెండు పదాలలో ఏ పదంలో తక్కువ అచ్చులు ఉన్నాయో, ఆ పదాన్ని ముందుగా చెప్పి, ఆ తరువాత ఎక్కువ అచ్చులు ఉండే పదాన్ని తరువాత చెప్పే ఒక క్రమం ఉన్నది. ఉదాహరణకు, రామ, నారాయణ అనే రెండు శబ్దాలను రెండిటినీ కలిపి చెప్పవలసి వచ్చినప్పుడు, ముందుగా తక్కువ

అచ్చులను కలిగిన రామశబ్దాన్ని చెప్పి,ఆ తరువాత ఎక్కువ అచ్చులను కలిగిన నారాయణ శబ్దాన్ని చెప్పి, రామనారాయణ అని చెప్పే క్రమం ఇది.

అయితే, ఈ న్యాయం వర్తించని సందర్భం కూడా ఉంటుంది. ఆ విధంగా ఎక్కడ వర్తించదు? అంటే, రెండు పదాలలో ఏ పదం చేత చెప్పబడే విషయానికి ప్రాబల్యం ఉన్నదో, ఆ విషయాన్ని చెప్పే పదాన్ని ముందు నిర్దేశించి, అంతకంటే తక్కువ ప్రాబల్యాన్ని కలిగిన విషయాన్ని చెప్పే పదాన్ని తరువాత నిర్దేశించే క్రమం కూడా ఒకటి ఉన్నది దీనికి "అభ్యర్హితం పూర్వమ్"అని పేరు.

పురాణమనే, ఇతిహాసమనే రెండు పదాలను గమనించినప్పుడు, పురాణ శబ్దంలో మూడు అచ్చులు,ఇతిహాసపదంలో నాలుగు అచ్చులు ఉన్నాయి. కనుక, ముందు ప్రస్తావించిన "అల్పాచ్ తరం పూర్వమ్ "అనే న్యాయాన్ని అనుసరించి చెప్పవలసింది వస్తే, పురాణేతిహాసాలు అని చెప్పాలి.

కానీ, పైన ఉదాహరించిన మహాభారత శ్లోకంలో ఏ విధంగా నిర్దేశింపబడింది? ఈ క్రమానికి విరుద్ధంగా "ఇతిహాస పురాణాభ్యామ్"అని నిర్దేశింపబడింది. ఎందుకు ఈ విధంగా నిర్దేశింపబడింది? అని అంటే, దీనికి సమాధానాన్ని "అభ్యర్హితం పూర్వమ్"అనే న్యాయం తెలుపుతున్నది. అంటే, ఇతిహాసాలు ప్రతిపాదించే అర్థం పురాణాలు ప్రతిపాదించే అర్థం కంటే ప్రబలం కనుక, వేదార్థ నిర్ణయాన్ని చేయడంలో పురాణాల కంటే ఇతిహాసాలు ఎక్కువ ప్రాముఖ్యాన్ని కలిగినవి. కనుక, పైన ఉదాహరింపబడిన మహాభారత శ్లోకంలో ఇతిహాసాలు ముందు నిర్దేశింపబడి, ఆ తరువాత పురాణాలు నిర్దేశింపబడ్డాయి —అని తెలియాలి.

## పురాణాల కంటే ఇతిహాసాలకు కల ప్రాబల్యమ్

ఈ విధంగా ఈ మహాభారత శ్లోకంలో ఇతిహాసపదం ముందు నిర్దేశింపబడడం చేత, పురాణపదం తర్వాత నిర్దేశింపబడడం చేత, పురాణాల కంటే వాటికి గల ప్రాముఖ్యం, ప్రాబల్యం స్పష్టమవుతున్నది. ఈ కారణం కంటే కూడా ఇంకా చాలా కారణాలు ఇతిహాసాల ప్రాబల్యాన్ని నిరూపిస్తున్నాయి. ఈ కారణాలను విశదవాక్ శిఖామణి శ్రీవరవరమునులు శ్రీవచనభూషణ వ్యాఖ్యానంలో అందంగా అనుగ్రహించారు. వాటిని సంగ్రహంగా అనుసంధిద్దాం.

వాటిలో, మొదటి కారణం ఏమంటే,

పురాణం అంటేనే, అది చాలా కాలం క్రితం జరిగిన వృత్తాంతం అని అర్థం అవుతుంది. "పురా అపి నవమ్"(పాతది అయినా కొత్తగా తోచేది) అనే పురాణశబ్ద నిర్వచనమే దీనిని తెలుపుతున్నది. అందువల్ల పురాణం అంటే,ఎప్పుడో చాలా కాలం జరిగిన వృత్తాంతాన్ని తెలియజేసే గ్రంథం. చాలా కాలం క్రితం జరిగిన వృత్తాంతాన్ని తరువాత ఒకరు దానిని అందంగా వర్ణించి తెలియజేస్తే. అప్పుడు అది పురాణం అవుతుంది. అంటే, పురాణాన్ని రచించిన మహర్షులు ఆ పురాణంలో వర్ణింపబడిన వృత్తాంతాన్ని నేరుగా చూచి ఉండరు. ఆచార్య ముఖంగా తెలిసికొనే ఉంటారు. లేక, తమ దివ్య దృష్టితో దర్శించి ఉంటారు. ఇందువల్ల పురాణాలలో దోషాలు ఉంటాయి అని అర్థం కాదు దివ్యదృష్టి గొప్పదే. ఆచార్య ముఖంగా గ్రహించడం కూడా గొప్పదే. కానీ, పురాణాలలో వర్ణింపబడిన వృత్తాంతాలు వాటి వక్తల చేత నేరుగా దర్శింపబడినవి కావు –అనే కొరత మాత్రం పురాణాలకు ఉన్నది. వారికి సమకాలంలో జరిగిన వృత్తాంతమై అది ఉండదు. వారు నేరుగా చూచిన వృత్తాంతమై ఉండదు. కనుక, ఆ వృత్తాంతాలకు సంబంధించిన జ్ఞానం వారికి ప్రత్యక్షం కాదు పరోక్షమనే చెప్పాలి. జరిగిన వృత్తాంతాలను ప్రత్యక్షంగా చూసినంతటి స్పష్టత వారికి ఉండే అవకాశం లేదు. ఇది పురాణాల స్వరూపం.

కాని, ఇతిహాసాల స్వరూపం వేరు. ఇతిహాసాలను ఎవరైతే రచించారో, వారి కాలంలోనే ఇతిహాసాలలో వర్ణింపబడిన సంఘటనలు అన్నీ జరిగి ఉంటాయి. వాటిని ఇతిహాసాలను రచించినవారు ప్రత్యక్షంగా చూచి ఉంటారు కూడా. సమకాలంలోని వాటిని వారు రచించి ఉంటారు. ఈ దృష్టిలో చూసినప్పుడు, పురాణాల కంటే ఇతిహాసాలకు ఆధిక్యం, ప్రాబల్యం ఉన్నదని తెలుస్తున్నది.

ఇందువల్లనే ఇతిహాస శబ్దవ్యుత్పత్తి "ఇతి హ ఆస"(ఈ వృత్తాంతం ఈ విధంగానే జరిగింది) అని తెలిపేటట్లుగా ఏర్పడింది. ఇతిహాసాలలో వర్ణింపబడిన వృత్తాంతం ఈ విధంగానే నిశ్చయంగా ఎటువంటి సందేహం లేకుండా జరిగింది– అని నిర్ధారించి చెప్పేటట్లుగా ఉంటుంది.

ఇతిహాసాలలో ఒకటి అయిన శ్రీరామాయణాన్ని రచించినవారు వాల్మీకి మహర్షి. ఆ మహర్షి రామాయణంలో వర్ణించిన వృత్తాంతాలు అన్నీ సమకాలంలో జరిగినవే. శ్రీరాముడు వనవాసం చేసిన కాలంలో వాల్మీకి మహర్షి ఆశ్రమం చిత్రకూట ప్రాంతంలో ఉన్నది. వాల్మీకి మహర్షి ఆశ్రమానికి శ్రీరామచంద్రుడు వెళ్లినట్లుగా అయోధ్యాకాండలో మనకు కనిపిస్తుంది ఉత్తరకాండలో.సీతాపరిత్యాగ కుశలవ సంభవ సీతావతార పరిసమాప్తి ఇత్యాది సంఘటనలు ఆ ముని నేరుగా దర్శించినవే. అందువల్ల శ్రీరామాయణంలో జరిగిన సంఘటనలను వాల్మీకి మహర్షి నేరుగా దర్శించినవే. వాల్మీకి మహర్షికి దివ్య దృష్టి లేదా? అని అంటే, అది కూడా ఉన్నది. అందులో లోటు లేదు. బ్రహ్మ ప్రసాదించిన వరం ఉన్నది కదా. ఇంతకుమించి, ఆచార్యుడైన నారద మహర్షి వల్ల ఉపదేశాన్ని కూడా పొందాడు. ఈ విధంగా ప్రత్యక్షంగా తాను దర్శించినందువల్ల ప్రత్యక్ష ప్రమాణం, ఆచార్యోపదేశం వల్ల పొందినందు వల్ల శబ్దప్రమాణం, దివ్యదృష్టి ద్వారా గమనించి ఊహించి తెలుసుకున్నందున అనుమాన ప్రమాణం –అని ఈ విధంగా మూడు విధాలయిన

ప్రమాణాలతో సహకృతమైనది, వాల్మీకి మహర్షి రచించిన శ్రీరామాయణమనే ఇతిహాసం. కానీ, పురాణాల విషయంలో నేరుగా చూడనందువల్ల ప్రత్యక్ష ప్రమాణ సహకృతమైన జ్ఞానం లేదు. ఆచార్యోపదేశం అనే శబ్దప్రమాణం, దివ్యదృష్టి అనే అనుమాన ప్రమాణం– అనే ఈ రెండు ప్రమాణాలతో సహకృతమైన జ్ఞానమే పురాణాల విషయంలో కనబడుతుంది.

మహాభారతంలోని సంగతి కూడా ఇటువంటిదే. మహాభారతాన్ని రచించిన వ్యాసమహర్షి మహాభారతంలో వర్ణింపబడిన పాండవుల జన్మ,వారి విద్యాభ్యాసం, శ్రీకృష్ణ భగవానుని అవతారం, ఆ స్వామి దివ్యలీలలు, పాండవుల అరణ్యావాసం, మహాభారతయుద్ధం మొదలైన సంఘటనలను అన్నిటిని ప్రత్యక్షంగా చూశాడు. ఇంతే కాదు, తాను ఈ విధంగా చూసిన ఈ వృత్తాంతాలను అన్నిటిని మహాభారత రూపంగా రచించి, వైశంపాయనునకు చెప్పగా, అతడు పాండవుల వంశంలో జన్మించిన జనమేజయునకు చెప్పాడు.

ఇటువంటి గొప్పతనం పురాణాలకు ఉందని చెప్పే అవకాశం లేదు. భాగవత పురాణం శ్రీకృష్ణుని వైభవమే అయినా, దానిని శుకమహర్షి పరీక్షిత్తునకు చెబుతున్నప్పటికీ, భాగవతంలో కేవలం పదవ స్కంధంలో మాత్రమే శ్రీకృష్ణుని చరిత్ర వర్ణింపబడింది. దానికి ముందు ఉండే స్కంధాలను గమనిస్తే, నృసింహావతార చరిత్ర, వామనావతార చరిత్ర మొదలైన ఎన్నో వృత్తాంతాలు వర్ణింపబడ్డాయి.అవి అన్ని శుకమహర్షి కాలంలో జరిగినది కావు. కనీ,మహాభారతంలో గమనిస్తే, అందులో ప్రస్తావింపబడిన అన్ని వృత్తాంతాలు అన్నీ ఆ ఇతిహాసాన్ని రచించిన వ్యాసమహర్షి కాలంలో జరిగినవే. (ఈ విధంగా తెలియజేయడం అంతా "న హి నిందాన్యాయాన్ని"అనుసరించి అని తెలియాలి తప్ప, పురాణాల న్యూనతను ప్రతిపాదించడం కోసం కాదు– అని గుర్తించాలి.)

ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉన్నది. వైశంపాయనుడు జనమేజయునకు మహాభారతాన్ని చెప్పినప్పుడు, అక్కడ ఉండి దానిని వినేవారికి ఆ కథకు సంబంధించిన కొంత అవగాహన ఉన్నది. అది సమీపకాలంలో జరిగిన వృత్తాంతమే కదా. వృత్తాంతంలోని కొన్ని తత్త్వ సూక్ష్మాలను మహర్షి తెలియజేస్తున్నాడు. ఆ విధంగానే శ్రీరామాయణాన్ని కుశలవులు గానం చేసినప్పుడు దానిని విన్న శ్రీరామునకు శ్రీరామాయణ గాథ అంతా తెలిసినదే. ఆ సభలో ఉండే వారికి అందరికీ తెలిసినదే. అందులో ఉండే తత్త్వార్థాలను, సూక్ష్మార్థాలను మహర్షి శ్రీరామాయణంలో ప్రస్తావిస్తున్నారు అని గ్రహించాలి. అందువల్ల ఇతిహాసాలను రెండిటిని మహర్షులు ప్రవచించినప్పుడు, వాటిలో ఉండే వృత్తాంతాలు అందరికీ తెలిసినవే. వాటి కథనంలో ఏ విధంగానూ అపార్థాలు, అసత్యాలు చోటు చేసుకునే అవకాశం లేదు. ఈ విధమైన అతిశయం ఇతిహాసాలకు ఉన్నది.

పురాణాల కంటే ఇతిహాసాలకు కల ఇంకొక అతిశయం ఏమంటే, పురాణాలే స్వయంగా ఇతిహాసాలను కీర్తించాయి. స్కాందపురాణంలో శ్రీరామాయణ మహిమ–

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"

(వేదం చేత తెలియబడే భగవంతుడు దశరథుని కుమారుడుగా అవతరించగా, ఆ వేదంకూడా, సాక్షాత్తు శ్రీరామాయణ రూపంలో వాల్మీకి మహర్షి ద్వారా అవతరించింది) అని కీర్తింపబడింది. మార్కండేయ పురాణంలోనూ, శైవపురాణంలోనూ మహాభారత వైభవాన్ని తెలిపే సూక్తులు ఉన్నాయి. ఆ విధంగా పురాణాల వైభవాన్ని వర్ణించే శ్లోకాలు గాని, సూక్తులు గాని ఇతిహాసాలలో ఉన్నట్లు కనిపించడం లేదు. దీనిని బట్టి పురాణాల కంటే ఇతిహాసాలు ఎక్కువ అతిశయాన్ని

కలిగినవి అని వ్యక్తమవుతున్నది కదా. ఈ విషయాన్ని కూడా శ్రీవచనభూషణ వ్యాఖ్యానంలో శ్రీవరవరమునులు అనుగ్రహించారు.

పురాణాలు వేదార్థాన్ని ఉపబృంహణం చేస్తున్నాయి, అందువల్ల గొప్పవి– అని అనడంలో సందేహం లేదు. కానీ, ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉన్నది. పురాణాలలో, కొన్ని పురాణాలు సాత్వికాలు అని, మరికొన్ని పురాణాలు రాజసాలు అని, మరికొన్ని పురాణాలు తామసాలు అని చెప్పబడుతున్నాయి. పురాణాలు అన్నిటిలో పరమ ప్రమాణమైనది పురాణరత్నం అనబడే శ్రీవిష్ణు పురాణం. భగవద్రామానుజులు శ్రీ భాష్యం, గీతాభాష్యం, వేదార్థసంగ్రహం మొదలైన తమ గ్రంథాలలో ఈ పురాణంలోని శ్లోకాలనే ముఖ్య ముఖ్య ప్రమాణాలుగా ఉదాహరించి చూపించారు. భాగవత పురాణాన్ని కూడా మనం ప్రమాణంగా గ్రహిస్తున్నాము. కానీ, కొన్ని పురాణాలను రాజసపురాణాలుగా, మరికొన్ని పురాణాలు తామస పురాణాలుగా గ్రహించి వాటికి అప్రాధాన్యం చెప్పబడుతున్నది.

బ్రహ్మకు రజోగుణం ఉద్రిక్తమైనప్పుడు చెప్పిన పురాణాలు రాజసపురాణాలు అని, అతనికి తమోగుణం అధికమైనప్పుడు చెప్పిన పురాణాలు తామస పురాణాలు అని చెప్పబడుతున్నాయి. ఇటువంటి పురాణాలు పరమ ప్రమాణాలుగా గ్రహింపబడడం లేదు. కేవలం సాత్విక పురాణాలు మాత్రమే సాకల్యంగా ప్రమాణాలుగా గ్రహింపబడుతున్నాయి. ఇటువంటి ప్రామాణ్య, అప్రామాణ్యవిభాగం ఇతిహాసాలలో లేదు. శ్రీరామాయణం, మహాభారతం అనే రెండు ఇతిహాసాలు పూర్తిగా పరమ ప్రమాణాలుగా చెప్పబడుతున్నాయి.

ఈ విషయంలో మన పూర్వాచార్యులు ఒక విషయాన్ని విచారించి నిరూపించి పలికారు. ఉదాహరణకు, లింగపురాణాన్ని గమనించినప్పుడు, ఆ

పురాణం లింగ వైభవాన్ని గూర్చి తెలియజేస్తున్నది, శివపురాణాన్ని గమనించినప్పుడు ఆది శివుని గొప్పతనాన్ని తెలియజేస్తున్నది, దేవీ భాగవతాన్ని గమనించినప్పుడు అది దేవీవైభవాన్ని తెలియజేస్తున్నది, స్కాంద పురాణాన్ని గమనించినప్పుడు అది స్కందుని వైభవాన్ని తెలియజేస్తున్నది– అని స్పష్టం అవుతుంది.

మరి, ఇంత మంది దేవతల వైభవాన్ని, ఇన్ని పురాణాలు తెలియజేస్తున్నప్పుడు, ఏ పురాణాన్ని ప్రమాణంగా మనం గ్రహించాలి? అనే సందేహం సహజంగా కలుగుతుంది. ఇక్కడ ఒక సూక్ష్మమైన అంశాన్ని మన పూర్వాచార్యులు తెలుపుతున్నారు.

లింగపురాణ ప్రారంభాన్ని మనం గమనించి చూస్తే, అందులో మొదట ఆచార్యుని శిష్యుడు ప్రశ్నించేటప్పుడు, ఆరంభంలోనే శిష్యుడు "నాకు లింగ వైభవాన్ని గురించి తెలియజేయవలసినది"అని కోరగా, దానికి బదులుగా ఆచార్యుడు ఆ పురాణాన్ని ప్రవచించినట్లు కనిపిస్తుంది. శిష్యుడు కోరిన విధంగా లింగ వైభవాన్ని చెప్పడం కోసమే ఆ పురాణాన్ని ఆచార్యుడు చెప్పినట్లు కనిపిస్తుంది.అందువల్ల అక్కడ ప్రశ్నవిశేషమైన ప్రశ్నయే. సమాధానం కూడా దానికి తగినట్లు విశేషమైన సమాధానమే.. అంటే, లింగ వైభవాన్ని చెప్పడం కోసమే ప్రశ్న, దాని సమాధానం కూడా ఏర్పడ్డాయి. స్కాంద పురాణ విషయం కూడా స్థితి అటువంటిదే. స్కందుని వైభవాన్ని చెప్పమని శిష్యుడు కోరగా, దానికి సమాధానంగా ఆ పురాణం ఆవిర్భవించింది.

అయితే, శ్రీయామునులు శ్రీ విష్ణుపురాణాన్ని పురాణరత్నమని కీర్తించటానికి కారణం ఏమంటే, మైత్రేయుడు పరాశర మహర్షిని సామాన్య ప్రశ్నను

అడుగగా, దానికి పరాశర మహర్షి విశేష పర్యవసానాన్ని కలిగిన సమాధానాన్ని తెలియచేయడమే. "ఈ లోకం ఎవని నుండి ఉద్భవించింది?ఏ విధంగా రూపొందింది? ఎవని పై ఆధారపడి ఉన్నది? ఎవనిలో లీనమవుతున్నది?"అని మైత్రేయుడు అడిగిన ప్రశ్న సామాన్యమైన ప్రశ్న.ప్రత్యేకించి, ఎవరిని ఉద్దేశించి అడిగిన ప్రశ్న కాదు. లింగ, శైవ పురాణాదులలో వలె "నేను ఈ దైవాన్ని గురించి తెలుసుకోవాలని అడుగుతున్నాను"అని ప్రశ్నించలేదు. ""తత్త్వం ఏది? హితం? ఏది పురుషార్థం ఏది? నాకు తెలియజేయవలసినది"అనే మాత్రమే మైత్రేయుడు ప్రశ్నించాడు.

అప్పుడు పరాశర మహర్షి సమాధానం పలుకుతూ, "విష్ణోః సకాశాదుద్భూతం జగత్ తత్రైవ చ స్థితమ్, స్థితిసంయమ కర్తాసౌ జగతో ౽,,స్య జగచ్చ సః"అని ఎటువంటి పక్షపాతం లేకుండా మధ్యసథమైన స్థితిలో ఉండి, "జగత్తు యొక్క సృష్టి స్థితి లయాలను గూర్చి నీవు తెలుసుకోవాలి అని అంటే, అప్పుడు నీవు విష్ణువును గూర్చి తెలుసుకో "అని శ్రీవిష్ణుపురాణాన్ని ప్రవచించాడు. అందువల్ల విష్ణు పురాణం ఎటువంటి పక్షపాతం లేకుండా పరాశరమహర్షి చేత చెప్పబడిన పురాణం కనుక, అది ప్రమాణ తమం అయినది.

ఈ విధంగా, కొన్ని పురాణాలు సాకల్యంగా ప్రమాణాలు, మరికొన్ని పాక్షికంగా ప్రమాణాలు అనే విభాగం పురాణాలలో కనబడుతుంది. కానీ ఇతిహాసాలలో ఇటువంటి విభాగానికి కానీ, ఇది ప్రమాణం అవునా? కాదా? అనే సంశయానికి కాని తావు లేదు– అని శ్రీవరవరమునులు వివరించారు.

ఇతిహాసాలలో గమనించినప్పుడు, విషయ ప్రతిపాదనలో ముందు వెనుకలకు వైరుధ్యం కనిపించదు. శ్రీరామాయణంలో ఆరంభం నుండి చివరి వరకు చెప్పబడిన విషయాలను గమనిస్తే, ఎక్కడ కూడా ముందు వెనుకలలో విరోధం ఏ విధంగాను కనిపించదు. ముందు చెప్పబడిన అర్థమే తరువాత కూడా

ప్రతిపాదింపబడుతుంది. మహాభారతంలోని సన్నివేశం కూడా అటువంటిదే. పురాణాలలో గమనించినప్పుడు, సాత్విక పురాణాలలో కూడా ముందు వెనుకలకు విషయవైరుధ్యం గోచరించదు. కానీ, రాజస తామస పురాణాలలో మాత్రం, కొన్ని కొన్ని సందర్భాలలో పూర్వోత్తర వైరుధ్యం గోచరిస్తుంది.

అయితే, ఇప్పుడు ఇంకొక ప్రశ్న కలుగవచ్చు. "ఇటువంటి రాజసతామసపురాణాల ఆవశ్యకత ఎందుకు? వాటిని చెప్పడం ఎందుకు? సాత్విక పురాణాలే చాలు కదా"అనే సందేహం ఏర్పడవచ్చు. కానీ, ఇటువంటి రాజస తామస పురాణాల ఆవిర్భా వం ఎందుకు జరిగింది? అని అంటే, లోకంలో అందరూ సాత్విక గుణాన్ని కలిగిన వారే ఉండరు కదా. సాత్విక గుణాన్ని కలిగిన వారు సాత్విక దేవతలను మెచ్చుతారు. కానీ, రాజసతామస గుణాలను కలిగినవారు ఆ రాజసతామస గుణాలను కలిగిన దైవాలనే ఆరాధించ కోరుతారు. కనుక, వారి కోసం ఈ పురాణాలు ఏర్పడ్డాయి. ఈ పురాణాలలో వర్ణింపబడిన మహిమను కలిగిన, ఆ యా రాజస తామస దైవాలను వేరు వేరు మనస్తత్వాలను కలిగిన వ్యక్తులు మొదట ఆరాధించినప్పటికీ, క్రమంగా వారు భగవదనుగ్రహం చేత ఆచార్యకటాక్షం చేత సాత్విక దైవాన్ని ఆరాధించి, పరమపురుషార్థ సిద్ధిని పొందే అవకాశం కలుగుతుంది ఇందువల్ల ఈ పురాణాల ఆవశ్యకత ఏర్పడింది. వారి వారి రుచులకు కనుగుణంగా ఆరాధనా ప్రకారాలను వారికి తెలియజేయాలి కదా. అందుకోసమై ఈ రాజసతామస పురాణాలు ఏర్పడ్డాయి.

భగవద్రామానుజులు శ్రీభాష్యంలోని స్మృత్యధికరణంలో "స్మృత్యనవకాశ ప్రసంగాదితి చేత్"ఇత్యాది సూత్ర వ్యాఖ్యానంలో ఈ విషయాన్ని తెలిపారు. ఏ స్మృతికి అవకాశం లేదు, అక్కరలేదు– అని భావించరాదు. ప్రతి స్మృతికి దానికి తగిన అధికారులు తప్పక ఉంటారు అందుకోసమే ఇన్ని విధాలయిన స్మృతులను భగవానుడు లోకంలో సృష్టి చేశాడు. ముందుగానే అందరికీ "శ్రీమన్నారాయణడే పరదైవం "అని ఉపదేశిస్తే వారికి రుచించదు. ఆ ఉపదేశం వారికి అర్థం కాదు

కూడా. అందువల్ల వారు అధోగతి పాలవకుండా ఉండేటట్లుగా, వారి స్థితికి తగినట్లుగా ఒక మతాన్ని, సిద్ధాంతాన్ని భగవంతుడు సృష్టి చేసి వారికి అనుగ్రహిస్తాడు. ఈ విధంగా అతడు చేయడం అంతా, తరువాతి కాలంలో వారు వారు మంచి మార్గంలోకి వచ్చి,తమ పురుషార్థాన్ని పొందడం కోసమే. అందువల్ల,ఈ దృష్టిలో చూసినప్పుడు, రాజసపురాణానికి అయినా, తామసపురాణానికి అయినా, ఒక ఆవశ్యకత ఉన్నది అని తెలుస్తున్నది కదా.

భగవదనుగ్రహాన్ని పొంది సదాచార్య కటాక్షం వల్ల భగవద్రామానుజ సంప్రదాయంలోకి వచ్చిన మనకు రాజసతామసపురాణాల ఆవశ్యకత లేదు. కానీ, ఇతిహాసాలు అందరికీ ఉపాదేయాలుగా,ప్రమాణాలుగా ప్రకాశిస్తున్నవి. ఇది కూడా పురాణాల కంటే ఇతిహాసాలకు కల అతిశయాలలో ఒకటి.

పురాణాలలో పలు విషయాలు వర్ణింపబడినప్పటికీ కూడా, ఇతిహాసాలలో విషయ ప్రతిపాదన సాకల్యంగా ఉంటుంది. మహాభారతంలోని ఒక శ్లోకం ఈ విషయాన్ని తెలియజేస్తున్నది.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!,
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"

(భరతవంశంలో పుట్టిన గొప్ప రాజా! ధర్మం, అర్థం, కామం, మోక్షం–అనే నాలుగు విధాలైన పురుషార్థాలలో ఈఏవిషయమైనా, ఇక్కడ ఉన్నదే వేరొక చోట కూడా ఉంటుంది. ఈ మహాభారతంలో లేనిది మరెక్కడా ఉండదు) అనేది ఆ శ్లోకం. ఇటువంటి అతిశయం ఇతిహాసాలకు ఉన్నది. ఈ రీతిగా కూడా ఇతిహాసాలకు పురాణాల కంటే అతిశయం ఉన్నది.

ఈ విధంగా, సమకాలంలోని రచింపబడి, దివ్య దృష్టితో దర్శింపబడి, ఆచార్యులచే ఉపదేశింపబడి, ముందు వెనుకలలో ఎటువంటి అర్థవిరోధం లేనివై, అందరికీ సమానంగా ఆదరింపదగినవై ఉండేవికదా ఇతిహాసాలు.స్వస్తి.

★★★★★

# ఆళ్వారులు దర్శించిన గరుడసేవ

శ్రీవైష్ణవ సంప్రదాయంలో గరుడసేవకు చాలా ప్రాధాన్యం ఉన్నది. వేదంద్వారా ఆ వేదం ప్రతిపాదించే పరతత్త్వాన్ని దర్శించడమే గరుడసేవలోని పరమార్థం.

గరుడుడు వేదస్వరూపి. భగవంతుడు శ్రీమన్నారాయణుడు. అతడే వేదం తెలియజేసే పరతత్త్వం. ఆ వేదాన్ని ద్రావిడ భాషలో అనుగ్రహించిన ఆళ్వారులు అందరూ గరుడ దర్శనాన్ని పొంది, గరుడునిపై అధిరోహించి వచ్చే పరమాత్మను, గరుడసేవను దర్శించి, పాడకుండా ఉండలేరు కదా.

గరుడుడు భగవంతుని శ్రీచరణాలను రెండిటినీ తన రెండు చేతులతో వహించి పట్టుకొని, తిరువీథులలో సంచరించే దృశ్యాన్ని గరుడసేవ అని అంటారు. అప్పుడు భగవంతుడు, గరుడుడు అనే ఇద్దరి కృప లభించడాన్ని భక్తులు అపూర్వమైన లాభంగా భావిస్తారు.

ఇప్పుడు, అళ్వార్లు దర్శించి కీర్తించిన గరుడ సేవలోని కొన్ని విశేషాలను అనుసంధించుకుందాం.

1) పెరియాళ్వార్లు దర్శించిన గరుడసేవ

పాండ్యరాజు సభలో వాదవిజయానికి ఆవశ్యకమైన వేదసూక్తులను పలికి, పరతత్త్వ విషయంలో ఏర్పడిన సందేహాన్ని తీర్చిన పెరియాళ్వారుల ముందు భగవంతుడు గరుడ వాహనారూఢుడై ప్రత్యక్షమయ్యాడు. తన సేవను అనుగ్రహించాడు. ఆ గరుడసేవ దర్శన సందర్భంగానే పెరియాళ్వార్లు "స్వామీ! గరుడనిపై నీవు ఆరోహించి వచ్చి నాకు దర్శనాన్ని అనుగ్రహించిన నీ కరుణ అపారమైనది. నీవు నన్ను రక్షించాలని నిశ్చయించేసుకున్న తరువాత, నాకు జన్మదుఃఖాలు అన్నీ తీరిపోయాయి"

**"పఱవై యేఱుమ్ పరమ్ పురుడా! నీ ఎన్నై క్కై క్కొండ పిన్**

పిఱవి ఎన్నుమ్ పెరుమ్ కడలు వற்றி పెరుమ్ పదమ్ ఆగిన్దదు"

(గరుడు నిపై అధిరోహించే పరమపురుషా! నీవు నన్ను రక్ష్యవస్తువుగా గ్రహించిన తరువాత, నా జన్మ అనే మహాదుఃఖసముద్రం ఎండిపోయింది. గొప్పస్థానం అయిన పరమపదం లభిస్తున్నది).

అనే పాశురాన్ని అనుగ్రహించారు. తమ ప్రేమ భావనతో గరుడుని ఉద్దేశించి పలుకుతూ, మేల్కొని ఉండి, భగవంతుని శయన మందిరాన్ని రక్షించమని అంటున్నారు, వారు. ఈనాటికీ వైష్ణవ సంప్రదాయానికి సంబంధించిన దేవాలయాలలోనూ, మందిరాలలోనూ, గృహాలలోను ప్రతిరాత్రి భగవంతుని మందిర కవాటాలను మూసేటప్పుడు పెరియాళ్వార్లు అనుగ్రహించిన ఈ క్రింది పాశురాన్ని అనుసంధించడం అలవాటు

"ఉఱగల్ ఉఱగల్ ఉఱగల్ –– పఱవై అరైయా! ఉఱగల్ !
పళ్ళియఱై కుఱిక్కొళ్ మిన్"

(మేల్కొనండి, మేలుకొనండి,మేలుకొనండి.పక్షిరాజా !భగవంతుని శయన మందిరాన్ని రక్షించండి.)

2) గోదాదేవి దర్శించిన గరుడసేవ

గోదాదేవికి తండ్రి అయిన పెరియాళ్వార్లు గరుడుని అంశతో ఈనాటికి శ్రీవిల్లి పుత్తూరు క్షేత్రంలో భగవంతునితో ఏకాసనంలో వేంచేసి ఉంటారు. గోదాదేవి మనోనేత్రంలో శ్రీకృష్ణుడు గరుడునిపై వచ్చే దృశ్యం భాసించగా, ఆ సన్నివేశాన్ని ఆమె ఉత్తర భారతంలో ఉండే దివ్యదేశం అయిన బృందావనంలో ఈ క్రింది విధంగా దర్శిస్తున్నట్లు నాచ్చియార్ తిరుమొழி అనే తన ప్రబంధంలో పలికింది.

"మాలాయ్ పిఱంద నంబియై మాలే శెయ్యుమ్ మణాళనై,
ఎలా ప్పొయ్ గళ్ ఉరైప్పానై ఇంగే పోద క్కండీరే?,
మేలాల్ పరంద వియల్ కాప్పాన్ వినతైశిఱువన్ శిఱగెన్నుమ్
మేలాప్పిన్ కీழ் వరువానై విరుందావనత్తే కండోమే."

గరుడుని ముఖంలో కృప నిండి ఉంటుంది. గాంభీర్యం ప్రకాశిస్తుంది. తన రెండు రెక్కలను విప్పుకొని మండలా కారంగా ఆకాశంలో అతడు సంచరిస్తాడు. అతని రెక్కల కంటే అతని శరీరం విస్తరించి ఉంటుంది. అందమైన కుండలాలను తన చెవులలో అతడు అలంకరించుకొని ఉంటాడు. అతడు వంగిన కనుబొమ్మలను, గుండ్రని నేత్రాలను, పొడుగైన ముక్కును, తెల్లని ముఖాన్ని కలిగినవాడు, మూడు విభాగాలుగా విభాగింపబడి ఉండే గరుడుని రెక్కలు మూడు వేదాలుగా భావింపబడుతున్నాయి. గోదాదేవి ఇటువంటి గరుడుని పై అధిరోహించి వచ్చే భగవంతుని బృందావనంలో చూశాను– అని అంటున్నది.

3) భగవంతుడు, గరుడుడు ఒకరే

"భగవంతుడు,గరుడుడు ఇద్దరూ ఒకరే"అని మహాభారతంలోని ఆనుశాసనిక పర్వంలో కనబడుతున్నది. దీనికి కారణం ఏమంటే, వేదం అంటే గరుడుడు. వేదంలో చెప్పబడే అర్థం అంటే భగవంతుడే కనుక. ఇది వాచ్యవాచక సంబంధం కదా. తిరువాయ్ మొழி ప్రబంధాన్ని అనుసంధించడం, గరుడసేవను దర్శించడం, రెండూ ఒకటే. తిరువాయ్ మొழி వేదం, అంటే, గరుడుడు. తిరువాయ్ మొழிలోని అర్థం భగవంతుడు.

గరుడునకు – గరుత్మంతుడు, సుపర్ణుడు, పతగేంద్రుడు పక్షిరాజు, తార్క్ష్యుడు మొదలైన అనేక నామాలు ఉన్నాయి. ఇతనికి భగవంతునికి ఉన్నట్లే అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి,ప్రాకామ్యం, ఈశిత్వం, వశిత్వం అనే ఎనిమిది విధాలైన సిద్ధులు ఉన్నాయి. అంతే కాదు, వాటిని అతడు తన భక్తులకు అనుగ్రహిస్తాడు కూడా. జ్ఞానం, బలం, ఐశ్వర్యం,వీర్యం, శక్తి, తేజస్సు అనే ఆరు విధాలైన గుణాలు కూడా గరుడునకు ఉన్నాయి. వేదస్వరూపి అయిన గరుడుడు భగవంతునకు వాహనంగా ఉండడం ద్వారా వేదమే భగవంతుని మన దగ్గరకు తీసుకొని వస్తున్న సాధనంగా అవుతున్నాడు.–అనే తత్వాన్ని మనం గ్రహించవచ్చు.

4) నమ్మాళ్వారులు దర్శించిన గరుడసేవ

భక్తుల ఆర్తనాదాన్ని విన్న సమయంలో భగవంతుడు వారికి అభయాన్ని ఇవ్వడం కోసం ఆ స్వామిని భక్తుల దగ్గరకు తీసుకుని వచ్చి చేర్చేవాడు, గరుడుడు. నమ్మాళ్వారులు ఈ సన్నివేశాన్ని ఒక చక్కని ఈ పాశురంతో అనుగ్రహిస్తున్నారు.

**"ఓడుమ్ పుళ్ళేఱి శూడుమ్ తణ్ తుழాయ్,"**

(భగవానుడు గరుడుని అధిరోహించి వెళతాడు, తులసిని అలంకరించుకుంటాడు)

ఇక్కడ "గరుడుని "ఓడుమ్ పుళ్"అని అంటున్నారు. గరుడని పై ఎక్కి, తులసిని అలంకరించుకొని వచ్చే స్వామియే శ్రీమన్నారాయణుడు. అతడే నాకు స్వామి "–అని ఇక్కడ నమ్మాళ్వార్లు కీర్తిస్తున్నారు.

ఒక పాశురంలో –గజేంద్రుడు అనే ఏనుగును కాపాడడం కోసం గరుడ వాహనం పై ఎక్కి వచ్చిన స్వామి వేగాన్ని చూచి ఆళ్వార్లు ఈవిధంగా ఆశ్చర్య పడుతున్నారు.

"మழ్జ్ఞాద వైనుదియ శక్కర నల్ వలత్తైయాయ్!
తొழమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్ న్దు తోన్షినైయే,
మழ్జ్ఞాద ఞానమే పడైయాగ మలరులకిల్
తొழమ్బాయార్ క్కళిత్తాల్ ఉన్ శుడర్ చ్చోది మఱైయాదే!"

ఈ పాశురంలో నమ్మాళ్వారులు గరుడసేవలోని గొప్పతనాన్ని గూర్చి చాలా అద్భుతంగా ఒక విషయాన్ని తెలుపుతున్నారు. భగవంతుడు గరుడునిపై అధిరోహించి రావడం ఎందుకు? అని అంటే, తన ప్రభుత్వాన్ని ప్రదర్శించడం కోసం, తన వేరు వేరు గొప్పతనాలను చూపించడం కోసం అతడు వేరు వేరు వాహనాలలో వచ్చినప్పటికీ, తాను పరమాత్మ అనే విషయాన్ని భక్తులు ఆనందించడం కోసం గరుడునిపై ఎక్కి భగవంతుడు వస్తాడు. ఇది మొదటి విషయం.

ఇక, రెండవ విషయం ఏమంటే, ఒక ప్రాణాన్ని కాపాడాలి– అనే దయాగుణంలోని ఆధిక్యంతో భగవంతుడు గరుడునిపై వేగంగా వస్తున్నాడు.. పక్షులలో చాలా వేగంగా ఎగిరి రాగలిగినది గరుడుడే. అందువల్ల భగవానుడు గరుడునిపై ఆరోహించి వస్తున్నాడు అనేది ఒక విషయమై ఉన్నప్పటికీ, అంత వేగంగా వెళ్లే ఆ గరుడుని వేగంగా నడిపేవాడుకూడా భగవంతుడు అనేది కూడా ఈ గరుడసేవలోని సూక్ష్మమైన వేరొక విషయం.

దీనిని,పరాశరభట్టర్ అనే ఆచార్యులు శ్రీరంగ రాజస్తవంలో తెలియజేశారు."శ్రీ రంగనాథా! నీవు ఈ గజేంద్రుని కాపాడడం కోసం పరిగెత్తుకుని వచ్చావు కదా. నేను నీకు చేసే ఈ నా నమస్కారం అందుకోసమే కాదు. నీవు, ఈ గజేంద్రుని కాపాడడం కోసం చూపించిన మహావేగం ఉన్నది కదా. అది నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. ఆ వేగానికి నా నమస్కారాన్ని పలుకుతున్నాను. "భగవత స్త్వరాయై నమః"అని చమత్కరించారు.

నమ్మాళ్వార్లు– సుదర్శన చక్రాన్ని ధరించి, గరుడునిపై అధిరోహించి వచ్చిన భగవంతుని గరుడసేవను కీర్తిస్తూ పాడే ఒక పాశురం ఉన్నది. చక్రాయుధాన్ని ఉన్నచోటనే ఉండి ప్రయోగించి, గజేంద్రుని దుఃఖాన్ని భగవంతుడు తీర్చవచ్చు కదా. దానికోసంగా భగవంతుడు గరుడుని పైకి ఎక్కి నేరుగా రావాలా? అనే ఒక ప్రశ్న కూడా కలుగుతుంది. గజేంద్రుడు అనే ఏనుగు ప్రాణాన్ని మాత్రం కాపాడడం కోసం అయితే, భగవంతుడు తాను ఉన్నచోటనే ఉండి, తన సంకల్పంతో ఆ గజేంద్రుని రక్షించి ఉండవచ్చు..అయితే, "ఈ గరుడసేవ దృశ్యాన్ని చూడాలి"అని ఆ ఏనుగు కోరి, ప్రతిదినం తామర పువ్వులను స్వామి పాదాలలో సమర్పించి పూజను చేసింది. అందువల్ల ఆళ్వారులు ఇక్కడ "తొழும் కాదల్ కళిఱు "(భగవంతుని దర్శించి నేరుగా సేవించాలి అనే భక్తిని కలిగిన ఏనుగు) అనే ఒక విలక్షణమైన పదప్రయోగాన్ని చేశారు.

ఆళ్వారులు దర్శించిన గరుడసేవ

భగవంతుడు తానే నేరుగా వచ్చి, గరుడునిపై తాను అధిరోహించి ఉండే సేవను అనుగ్రహిస్తేనే, గజేంద్రునకు కలిగిన దుఃఖం తీరుతుంది. అతని ప్రాణాలను రక్షించినంత మాత్రంతో తీరదు– అనే అర్థాన్ని చెప్పడం కోసమే "తొழుమ్ కాదల్ కళిఱళిప్పాన్ పుళ్ళూర్ న్దు తోన్రినైయే"అనే ప్రయోగాన్ని ఆళ్వార్లు చేశారు.

భక్తులు ఈ గరుడ సేవను దర్శించేటప్పుడు సంతోషాన్ని పొందుతున్నారు. అందువల్లనే దేవాలయాలు అన్నిటిలోనూ బ్రహ్మోత్సవాల సందర్భంగా గరుడసేవ తప్పక నిర్వహింపబడుతున్నది.

5) తొండరడి ప్పొడి ఆళ్వారులు దర్శించిన గరుడ సేవ

తొండరడి ప్పొడి ఆళ్వారులు –తనను నమ్మి, తనకు పూజ చేయాలి అనే ఆశతో ఒక తామర పువ్వును కోసి,ఆ ఆరాధనలో ఏ విధమైన దోషం, లోపం రాకూడదు అని తపించి, తనను కొలిచిన గజేంద్రుని రక్షించడం కోసం పరిగెత్తుకుని వచ్చిన భగవంతుడు అందంగా గరుడ వాహనంలో సేవను అనుగ్రహిస్తున్నాడు, అతడు అనుగ్రహించే సంపద ఉన్నతమైన సంపద. మోక్షంతో పాటు, మీరు కోరుతున్న సంపదను అంతా అతడు ఇవ్వడం కోసం సిద్ధంగా ఉండేటప్పుడు, మీరు నిలకడగా నిలచి ఉండని సంపదలను ఎందుకు అన్వేషిస్తున్నారు? అని ప్రశ్నించారు. ఈ గరుడ సేవను చూసే ఒక్కొక్కరికి ఏనాటికి తరగని సంపదను ఇవ్వాలని వేచి భగవానుడు ఉన్నాడు. గరుడసేవను దర్శించడం అనేది ఎంతటి ఉన్నతమైనది? అనే విషయాన్ని ఈ పాశురంలో ఆళ్వారులు తెలియజేస్తున్నారు.

"నాట్టినాన్ దెయ్ వ మెంగుమ్ నల్లదోర్ అరుళ్ తన్నాలే,
కాట్టినాన్ తిరువరంగమ్ ఉయ్ బవర్క్కు ఉయ్యుమ్ వణ్ణమ్,
కేట్టిరే నంబిమీర్ కాళ్! కెరుడ వాగననుమ్ నిఱ్క,
శేట్టై తన్ మడియగత్తు చ్చెల్వమ్ పార్త్తిరుక్కిన్రీరే"

6) కులశేఖరాళ్వారులు దర్శించిన గరుడసేవ

కులశేఖరాళ్వారులు శ్రీరంగనాథుని సేవ కోసం తపించారు. వారు, మనం ఈనాడు సాధారణ నేత్రాలతో దర్శించే గర్భాలయంలోని దృశ్యాన్ని మాత్రమే దర్శించాలని కోరలేదు.

శ్రీరంగంలో ఆదిశేషునిపై పరుండి ఉండే లక్ష్మీనాథా! నీవు నాకు ఏ విధంగా దర్శనాన్ని అనుగ్రహించాలో తెలుసునా? "నీవు, నీ పంచాయుధాలు దర్శనమివ్వాలి. అంత మాత్రమే కాదు, నీ సమీపంలో మహా వేగంగా ప్రయాణం చేసే, విజయాన్ని తప్ప వేరొకటిని ఏమీ తెలియని ఆ గరుడుడు కూడా నిన్ను చుట్టూ పరిభ్రమిస్తూ ఉండాలి. ఆ దృశ్యాన్ని నేను శ్రీరంగంలో దర్శించాలి– అని ప్రార్థిస్తున్నారు, ఈ పాశురంలో.

కోలార్ న్ద నెడుమ్ శార్ జ్గమ్ కూనఛ్ఛంగమ్
కొలై ఆఴి కొడుమ్ తణ్డు కొట్ట్ర ఒళ్వాళ్
కాలార్ న్ద కది క్కరుడనెన్నుమ్, వెన్ఱి
క్కడుమ్ పఱవై ఇవై అనైత్తుమ్ పుఱఞ్జూఴ్ కాప్ప
శేలార్ న్ద నెడుంకఴని శోలై శూఴ్న్ద
తిరువరంగత్తరవణైయిల్ పళ్ళి కొళ్ళుమ్
మాలోనై క్కణ్డిన్బ క్కలవి ఎయ్ దు
వల్వినైయేన్ ఎన్ఱు కొలో వాళ్ణ నాళే?

7) తిరుమంగై ఆళ్వార్లు దర్శించిన గరుడసేవ

ఆళ్వార్లు అందరిలో,. వయస్సును బట్టి చిన్న ఆళ్వార్లు తిరుమంగై ఆళ్వారులు. వారు, పలు దివ్యదేశాలను దర్శించి అక్కడ జరిగే ఉత్సవాలలో గరుడ సేవను సేవించి ఆయా సన్నివేశాలను తమ ప్రబంధాలలో కీర్తించే అలవాటును

కలవారు..జగత్ ప్రసిద్ధమైనవి తిరునాంగూర్ దివ్య దేశంలోని 11 గరుడ సేవలు. ఆ సందర్భంలో తిరునాంగూర్ దివ్య దేశాలలో ఉండే అర్చామూర్తులు అందరూ బంగారు గరుడ వాహనాన్ని అధిరోహించి, తైమాసం అమావాస్య మరునాడు, తిరుమంగై ఆళ్వారులు హంస వాహనంపై అధిరోహించి రాగా, వారితో కలసి వారు అనుగ్రహించిన దివ్య పాశురాలు గానం చేయబడుతూ ఉండగా, తిరువీథులలో విహరిస్తారు.

తిరుమంగై అళ్వార్లు అనేక స్థలాలలో జరిగే గరుడ సేవలను ఉద్దేశించి పాశురాలను పాడారు. సంప్రదాయంలో గరుడునకు పెరియ తిరువడి అని పేరు. హనుమంతునకు తిరువడి అని పేరు. గరుడునకు ప్రత్యేకమైన దివ్య క్షేత్రం తిరునఱైయూర్ అనే క్షేత్రం.

(నాచ్చియార్ కోయిల్ ) తిరునఱైయూర్ నంబి అళ్వార్లకు ఆచార్యుడు. ఈ క్షేత్రం కుంభకోణానికి దగ్గరలో ఉన్నది. ఇక్కడ జరిగే కల్ గరుడ సేవ చాలా గొప్పది. అక్కడ గజేంద్రుని రక్షించడానికి అధిరోహించి భగవంతుడు వచ్చే సన్నివేశాన్ని తిరుమంగై ఆళ్వారులు

**తూ వాయ పుళ్ ఊర్ న్దు వందు తుఱై వేழம్**
**మూవామై నల్ కి ముదలై తుణిత్తానై,**
**దేవాది దేవనై చ్చెంగమల క్కణ్ణానై,**
**నావాయ్ ఉళానై నఱైయూరిల్ కణ్డేనే**
అని కీర్తించారు.

ఆ విధంగానే తిరుక్కుడందై అనే క్షేత్రంలో ఉండే ఆరావముదాళ్వార్ కోసం తిరువెழுకూற்றிరుక్కై అనే రథవన్ ప్రబంధాన్ని రచించారు అందులో గజేంద్రుని కాపాడడం కోసం భగవంతుడు బయలుదేరి వెళ్ళాడు అనే వృత్తాంతాన్ని స్తుతించారు. అప్పుడు గరుడుని వేగంతో దిక్కులు కంపించడం అందరూ తెలిసికొన్నారు—అని అన్నారు.

గజేంద్రుడు చేసిన ఆర్తనాధాన్ని అందరూ విన్నారు. దానిని కాపాడడం అన్య దేవతలకు సాధ్యం కాదు –అనే స్థితిని కూడా చూశారు. ఆ గజేంద్రుని కాపాడడం కోసం భగవంతుడు గరుడునిపై బయలుదేరి వచ్చిన ధ్వనినికూడా వారు విన్నారు– అనేది ఈ పాశురంలోని గొప్పతనం. ఇక, "ఆ ముసలి కూడా తరించింది", అని తమ మనసులో నెమ్మదిని పొందారు –అని ఒక నూతనమైన విషయాన్ని కూడా తెలియజేశారు, ఆళ్వారులు.

ఒక బలవంతుని చేతిలో బలహీనుడు చిక్కుకున్నాడు అనుకోండి. మనకు అతనిని కాపాడడం సాధ్యం కాలేదు. అప్పుడు దూరంలో ఉండే రక్షకభట వాహనం వచ్చే ధ్వని వినిపిస్తున్నది. అప్పుడు మన మనసులో ఉండే భయం అంతా తీరిపోతుంది కదా. ఆ విధంగానే, గరుడుడు వచ్చే వేగాన్ని తిరుమంగైయాళ్వారులు వర్ణిస్తున్నారు.

ఒరు ముఱై ఈరడి మూవులకు అళందనై
నాற்றిశై నడుంగ అంజిఱై ప్పుఱవై ఏఱి
నాల్వాయ్ ముమ్మద త్తిరుచ్చెవి ఒరుతని వేழత్తరందైయై
ఒరునాళ్ ఇరునీర్ మడువిల్ తీర్ త్తనై.

దివ్యదేశాలలో చాలా గొప్ప దివ్యదేశమైన తిరుచిత్తర కూటమ్. ఈ దివ్యదేశంలోని ఉత్సవమూర్తికి చిత్తిర కూటత్తు ఉళ్ళార్ అని పేరును తిరుమంగై ఆళ్వారులు పెట్టారు. అక్కడ బ్రహ్మోత్సవంలో గరుడ సేవ దృశ్యాన్ని తమ పెరియ తిరుమొழి ప్రబంధంలో ఈ క్రింది విధంగా కీర్తిస్తున్నారు.

★ఎయ్యచ్చిఱైంద త్తిలంగై మలంగ వరుమ ణాழ కాప్పాన్,
ఉయ్య ప్పరువరై తాంగి ఆనిరై కాత్తాన్ ఎన్ఱేత్తి,
వైయత్తెవరుం వణంగ అణంగెழ మామలై పోలే,
దెయ్ వ ప్పుళ్ళేఱి వరువాన్ శిత్తిరకూడత్తుళ్ళానే.

## 8) తిరుమழிశై ఆళ్వారులు దర్శించిన గరుడసేవ

తిరుమழிశై ఆళ్వారులు కూడా తమ నాన్మొగన్ తిరువందాది అనేది ప్రబంధంలో గరుడసేవ దర్శనఫలాన్ని అనుగ్రహిస్తున్నారు. ఆ భగవంతునకు గజేంద్రవరదుడు అని పేరు. ఈ పేరుతోనే గరుడసేవ దర్శనం కలుగుతున్నది కదా. ఆ దర్శనం వల్ల ఏమి ఫలం కలుగుతుందని ఆళ్వారులు చెబుతున్నారో చూద్దాం.

**కూற்றముమ్ శారా కొడు వినైయుమ్ శారా తీ**

**మాற்றముమ్ శారా వకై యఱిందేన్,–ఆற்றம్**

కరై క్కిడక్కుమ్ కణ్ణన్ కడల్ కిడక్కుమ్ మయన్

ఉరైక్కిడక్కుమ్ ఉళ్ళదు ఎనక్కు.

గరుడునిపై భగవంతుని సేవిస్తే, మనకు ఏ భయం లేదు, మన పాపాలు తీరిపోతాయి– అని ఇక్కడ ఆళ్వారులు నిశ్చయించి పలుకుతున్నారు. ఈ విధంగా నిశ్చయించుకొని, ఆళ్వార్లు దర్శించిన ఆ గరుడసేవను మనం కూడా ఆ ఆళ్వారుల పాశురాలను సేవిస్తూ, దర్శిద్దాం.

★★★★★

సాంప్రదాయిక వ్యాస మాలిక

# శ్రీవిష్ణుపురాణంలోని ఖాండిక్య కేశిధ్వజసంవాదం

(అష్టాంగయోగ రహస్యస్వరూపం)

తనకు అష్టాంగయోగ స్వరూపాన్ని గూర్చి ఉపదేశించమని అర్థించిన ఖాండిక్యుని చూచి కేశిధ్వజుడు చాలా సంతోషించి, అతడు కోరిన విధంగా యోగమార్గాన్ని ఉపదేశించబోయేవాడై, సంసారక్లేశాలకు మూలమైన కారణాలను తెలిపి, వాటి నుండి విడుదలను పొందడానికి ఆవశ్యకమైన మార్గాన్ని ఈ క్రింది విధంగా ఉపదేశించాడు.

యోగాన్ని ఉపాసన చేసేవారు మొదట ప్రకృతి, పురుష స్వరూపాలను వివేకించి తెలిసికోవాలి. వేదం చేత విధింపబడిన వర్ణాశ్రమ ధర్మాలను వారు ఈ ఉపాసనానికి అంగంగా ఆచరిస్తూ ఉండాలి. ఖాండిక్యా! నేను చేసే ప్రజాపాలన రూపమైన రాజ్యభారం, యాగం మొదలైన వర్ణాశ్రమ ధర్మాలను ఉపాసనం వృద్ధికావడం కోసమే చేస్తున్నాను. వర్ణాశ్రమ ధర్మాలను ఆచరించడం వల్ల ఉపాసనకు విరోధులైన పాపాలు తొలగిపోతాయి. ఉపాసనకు విరోధులైన పాపాలు తొలగిపోతే, ఉపాసన అభివృద్ధి చెందుతుంది. సుఖాలు అనుభవించడం ద్వారా పుణ్యాలను లేకుండా చేసుకుంటున్నాను. ఉపాసనం చేసేవానికి పుణ్యం, పాపం అనే రెండూ కూడా విరోధులే. అందుచేత ఆ రెండిటిని పోగొట్టుకోవలసి ఉన్నది.. ఇంత శ్రమపడి, నేను నా మనసులో ఉండే రజస్సు, తమస్సులను పోగొట్టుకొని సత్వగుణాన్ని అభివృద్ధి చేసుకొని,జ్ఞానాన్ని పెంపొందించుకుంటున్నాను.

అహం హ్యవిద్యయా మృత్యుం తర్తుకామః కరోమి వై,
రాజ్యం యాగాంశ్చ వివిధాన్ భోగైః పుణ్యక్షయం తథా.

నీ మనసు అయితే, సహజంగానే ఈ విధమైన ప్రయత్నం లేకుండా, వివేకాన్ని పొంది వెలుగుతున్నది. ఇప్పుడు నీకు అవిద్య యొక్క స్వరూపాన్ని చెబుతాను. విను. ప్రయోజనాలను ఆశించి సంగంతో చేయబడే కర్మ ఇక్కడ అవిద్య అవుతున్నది.

("అవిద్యయా మృత్యుం తీర్త్వా"అనే ఉపనిషత్ వాక్యంలోనూ, "అహం హ్యావిద్యయా మృత్యుం తర్తుకామః కరోమి వై,"అని ఇక్కడ ఉండే శ్లోకంలోనూ కనబడే అవిద్యా అనే పదం కర్మనే చెబుతున్నది –అనేది మన పూర్వా చార్యుల అభిప్రాయం. ఈ కర్మ భక్తిని ప్రయోజనంగా ఆశించి చేసేటప్పుడు భక్తికి అంగం అవుతున్నది. ఆ విధంగా కాకుండా, ఈ లోకంలో ఉండే ప్రయోజనాలను ఆశించి చేసేటప్పుడు, సంసారానికి కారణం అవుతున్నది– అనే తేడాను ఇక్కడ తెలియాలి) ఇటువంటి కామ్య కర్మలవల్లనే సంసారం, అంటే, ఈ లోకంలో జీవనం అనే ఫలం కలుగుతున్నది. అందుచేతనే సంసార ఫలాన్ని ఇచ్చేది – ఈ కామ్య కర్మ అనే అవిద్య. ఇదే ఒక వృక్షం. దీనికి ఒక విధమైన భ్రమం (ఒక వస్తువును ఇంకొక వస్తువుగా మారుగా భావించే భావన) కారణం అవుతున్నది. ఆత్మ కానిది అయిన ఆ ఆత్మ కంటే అన్ని విధాలుగాను వేరయినది అయిన శరీరాన్ని ఆత్మగా భావించడం, ఆత్మ బాగుపడడానికి కారణం కాకుండా శరీరానికి మాత్రమే ఉపయోగించే తినే అన్నం, తాగే నీరు మొదలైనవానిని శరీరానికి ధారకపోషకాలను, తనవి కాని దానిని తనవిగా భావించడం –అనే ఈ రెండు విధాలయిన భ్రమలే ఇంతకు ముందు చెప్పిన అవిద్య అనే వృక్షానికి కారణాలు అవుతున్నాయి.

అనాత్మన్యాత్మబుద్ధి ర్యా చాస్వే స్వమితి యా మతిః,
ఆవిద్యాతరుసంభూతిః బీజమేతత్ ద్విధా స్థితమ్.

(ఇక్కడ, "సంసారఫలకం కామ్యకర్మ అవిద్యా, సైవ తరుః "అని విష్ణుచిత్తులు చూపించిన వ్యాఖ్యానం ప్రకారంగా అర్థం గ్రహించాలి)

ఈ శరీరం పంచభూతాల వల్ల ఏర్పడుతున్నది అందుచేత, ప్రాకృతం అవుతున్నది, ఆత్మ అయితే, పంచభూతాల కంటే వేరుగా ప్రకాశిస్తున్నది. ఈ విధంగా ఉండగా, అనాత్మ అయిన, అంటే,ఆత్మ కానిది అయిన, ఆత్మకంటే వేరైనది అయిన, ఈ పంచభూతమయమైన శరీరాన్ని మూఢులు ఆత్మ (అహమ్) అని భావించి, భ్రమను పొందుతున్నారు. ఆ విధంగానే, భార్య, గృహం మొదలైన అన్నీ కూడా ఈ శరీరానికే ఉపయోగపడేవి అవుతున్నాయి. శరీర సుఖాన్నే ఇవి ఇవ్వగలవు. ఆత్మతో సంబంధంలేని వీటిని "నాకు చెందినవి ఇవి"(మమ) అని మూఢులు భావిస్తున్నారు. ఈ విధంగా అన్ని విషయాలలోనూ జీవాత్మ పూర్వకర్మ వాసన అనే చీకటిలో మునిగిపడి ఉన్నాడు ఈ భ్రమచేత, శరీరం కంటే ఆత్మ వేరుగా ఉన్నప్పటికీ కూడా, ఆ వాస్తవాన్ని తెలియలేక, శరీరాన్ని ఆత్మగా భావించి, శరీర సుఖం కోసం అన్ని కార్యాలను ఈ జీవాత్మ చేస్తున్నాడు. ఇందువల్ల అతనికి పునర్జన్మయే కలుగుతున్నది..అందువల్ల, భ్రమచేత శరీర సుఖం కోసం జీవుడు పాటుపడి కర్మలను చేస్తున్నాడు. ఇటువంటి కర్మయే అవిద్య అవుతున్నది. ఇందువల్ల, మళ్లీ మళ్లీ జీవునకు సంసారం ఏర్పడుతున్నది.

లోకంలో కూడా మట్టితో నిర్మింపబడిన ఇంటి గోడలను మట్టితోనే పైన గట్టిచేస్తున్నాము మట్టిని పూస్తేనే గోడలు గట్టితనాన్ని పొందుతాయి. ఈ విధంగానే పృథివి, జలం మొదలైన పంచభూతాల వల్ల ఏర్పడే ఈ శరీరాన్ని కూడా అన్నం, నీరు మొదలైన వానిని ఉపయోగించి వృద్ధి చేస్తున్నాము. ఇప్పుడు చెప్పండి. పంచభూతమయమైన ఈ అన్నం మొదలైన తినుబండారాలతో పంచభూతమయమైన శరీరానికి మంచి కలుగుతుందా? ఆత్మకు మంచి

కలుగుతుందా? మట్టి గోడ ఉదాహరణ ద్వారా శరీరమే స్థైర్యాన్ని పొందుతుంది కదా.. ఆత్మ మంచిని పొందాలంటే దానికి తగిన వేరు మార్గాన్ని అన్వేషించాలి. ఈ మార్గమే ఉపాసనా మార్గం.

మనోమాలిన్యాలను పోగొట్టే అందమైన మార్గం

ఇంతే కాక, ఈ జీవాత్మ అనేక వేల సంఖ్యలలోని జన్మలను కలిగిన సంసారమార్గంలో ప్రయాణం చేసి, అలసి సొలసి ఉన్నాడు. అజ్ఞానం, కర్మ అనే రెండిటి వాసన అనే మాలిన్యం కలుగగా, దానివల్ల అజ్ఞాన కార్యమైన దుఃఖాలను పొందుతున్నాడు.

అనేక జన్మసాహస్ర సంసారపదవీం వ్రజన్,
మోహశ్రమం ప్రయాతో ఽ సౌ వాసనారేణు కుంఠితః

ఈ విధంగా దుఃఖపడుతూ ఉన్నప్పటికీ, ఈ ఆత్మకు మోహశ్రమాన్ని, అజ్ఞానం వల్ల కలిగే దుఃఖాలను పోగొట్టేది త్త్వజ్ఞానమే అవుతున్నది. శరీరంలో దుమ్ము సోకేటట్టుగా దారిలో నడచి, శ్రమపడిన బాటసారి వేడి నీళ్లు స్నానం చేస్తే, శరీరంలో అంటుకున్న దుమ్ము, దారిలో నడచి వచ్చిన శ్రమ సుఖంగా తొలగిపోతాయి. ఆ విధంగానే, తత్వజ్ఞానం అనే వేడి నీరే ఇక్కడ సంసారమార్గంలో నడిచి వచ్చే జీవునిపై పడిన వాసన అనే బూడిదను మోహమనే శ్రమను సులభంగా పోగొడుతున్నది. మోహం తొలగిపోతే మనసు తన స్థితిలో నిలచి ఉంటుంది, స్వస్థతను పొందుతుంది. తరువాత సాటి మేటి లేని గొప్పతనాన్ని పొందడం కోసం మోక్ష సుఖాన్ని ఈ జీవుడు పొందుతున్నాడు. మోక్షం అనేది– ఈ ఆత్మకు సహజంగానే ఉన్నది ఇంతకాలం కర్మ సంబంధం చేత ఆవరింపబడినవి అయిన అపహత పాప్మత్వం మొదలైన గుణాలు, స్వరూపం వికాసం అనే వీటిని పొందడమే. అందుచేత మోక్షం అనేది జీవుని కర్మ ఫలాలవలె, దీనికి ముందు లేనిదై, కొత్తగా

కలిగేది కాదు. అందుచేత ఇతడు (నిర్వాణమయ ఏవ) ఏ దోషం లేని ఆనంద స్వరూపుడే అవుతున్నాడు. జ్ఞానమయుడు కూడా. ఈ విధంగా జ్ఞానానంద స్వరూపుడైన ఈ ఆత్మకు సంసార దశలో కలిగే దుఃఖం,అజ్ఞానం మొదలైనవి. సహజమైన గుణాలు కావు. ప్రకృతి సంబంధించిన ఆత్మలో ఆరోపితాలు అవుతున్న గుణాలే.

నీరు సహజంగా చల్లగా ఉంటుంది. ఏ శబ్దం లేకుండా పొంగకుండా ఉంటుంది. ఇటువంటి నీటిని ఒక పాత్రలో పోసి పోయ్యిపై పెట్టి కాస్తున్నాము. చల్లని ఆ నీరు వేడిమిని పొందుతున్నది. శబ్దం అనేది సహజంగా లేని ఈ నీటిలో కళపెళ అనే శబ్దం కలుగుతుంది. ఏ చలనం లేకుండా, ప్రశాంతంగా ఉండే ఈ నీరు పొంగి పైకి వస్తున్నది. ఈ మార్పులు అన్నీదేనివల్ల కలిగాయి. అగ్ని సంబంధం వల్లనే కదా. అయితే, ఆ అగ్నికి నేరుగా నీటితో సంబంధం లేదు. నీటిని ధరించి ఉండే పాత్ర ద్వారానే ఈ రెండిటికి సంబంధం కలుగుతున్నది. ఆ పాత్రలో ధరింపబడి ఉండడం చేత జలం కూడా వేడిమి మొదలైన మార్పులను పొందుతున్నది. ఆ విధంగానే ఆత్మ విషయంలో కూడా భావించాలి.

జ్ఞానానంద స్వరూపమైన ఆత్మ జలం వంటిది. ప్రకృతి జలాన్ని ధరించే పాత్ర వంటిది. ఆ పాత్రతో నిప్పు సంబంధాన్ని పొందుతున్నట్లే, ఈ ప్రకృతితో తాపత్రయాలు సంబందాన్ని పొందుతున్నాయి. ఏ దోషం లేని జ్ఞానానంద స్వరూపమైన ఆత్మ, అగ్నితో సంబంధం కలిగిన పాత్రలో ఉండే చన్నీరు వేడిమి మొదలైన మార్పులను పొందేటట్లే, అజ్ఞానం,దుఃఖం మొదలైన మార్పులను పొందుతున్నది. ప్రకృతి యొక్క ధర్మాలైన ఆకలి, దాహం మొదలైన వారిని పొందుతున్నది. అయితే ప్రకృతి కంటే వేరైన ఆత్మ నిత్యమైనది. ఈ విధంగా అవిద్య(కామ్య కర్మల) కారణమైన భ్రమం అనేది రెండు విధాలుగా ఉంటుంది. వీటిని

పోగొట్టగలిగినది భగవంతుని ఆశ్రయించి చేసే ఉపాసన తప్ప, ఇంకొక ఉపాయం అనేది ఏదీ లేదు.

**యోగోపదేశం**

"ఖాండిక్యా! సంసార దుఃఖాలు అన్నిటినీ పోగొట్టగలిగిన యోగాన్ని గూర్చి చెబుతున్నాను, విను"అని కేశిధ్వజుడు ఇక యోగ స్వరూపాన్ని వివరంగా ఉపదేశించాడు. దానిని మనం జాగ్రత్తగా గమనించాలి.

ఈ యోగంలో (అంటే, ఉపాసనలో)ఉండేవాడు (అంటే, నిష్ఠను కలవాడు) అంటే, యోగసిద్ధుడు మోక్షాన్ని పొంది, దాని నుండి ఏ సమయంలోనూ తిరిగి సంసారానికి రాడు. ఇటువంటి మోక్షాన్ని పొందడానికి ముఖ్య కారణం మనసే. ఈ మనస్సు మిగిలిన విషయాలను ఆశ్రయిస్తే, సంసార బంధానికి కారణం అవుతున్నది ఈ మనస్సే ఇతర విషయాలను పట్టుకోకుండా వాటి నుండి విడుదలను పొందితే, మోక్షానికి కారణం అవుతుంది. ప్రకృతి, జీవుడు, ఈశ్వరుడు అనే మూడు విషయాలను వివేకించి తెలిసినవాడు మిగిలిన విషయాల నుండి మనసును నివర్తింప చేసి, ఆ మనసుతో భగవంతుని ధ్యానించాలి..ఈ విధంగా భగవంతుని ధ్యానిస్తూ ఉంటే, ఆ బ్రహ్మం తను ధ్యానం చేసేవానిని పరిశుద్ధునిగా చేసి, అతనిలో ఉండే దోషాలను తొలగించి, తన స్వభావాలను పొందేటట్లు చేస్తుంది. ఇక్కడ.అయస్కాంతాన్ని ఉదాహరణగా గమనిద్దాం. అది తనకు ఎదురుగా ఉండే ఇనుమును ఆకర్షించి, తన దగ్గరకు గ్రహించి, తన శక్తితో దానిని తన స్థితిని పొందేటట్లు చేస్తున్నది కదా. అంటే, అయస్కాంతం ఒకే స్థితిలో ఉంటే, దానికి వశమైన ఇనుము అదే స్థితిలో ఉంటుంది. అది కదిలితే ఇది కూడా కదులుతుంది. అది తిరిగితే ఇది కూడా తిరుగుతుంది. ఇంతే కాదు, అగ్ని తనలో పడిన బంగారాన్ని, అందులో ఉండే దోషాన్ని పోగొట్టి, తనవలె పరిశుద్ధిని కలిగిన దానినిగా చేస్తుంది. ఆ

విధంగానే, బ్రహ్మం తనను ధ్యానించేవానిలో ఉండే, సంసార బంధం వల్ల ఏర్పడిన దోషాలను పోగొట్టి, సత్య కామత్వం మొదలైన సహజమైన గుణాలను వికసించేటట్లు చేసి, తనవలె చేస్తుంది.

ఆత్మభావం నయత్యేనం తద్బ్రహ్మ ధ్యాయినం మునిమ్,
వికార్య మాత్మనః శక్త్యా లోహ మాకర్షకో యథా

(ఈ విధంగా ఉండే సందర్భాలలో సత్సంపదాయ క్రమంతో సదాచార్యుల సన్నిధిలో కాలక్షేపం చేసేవారికి మాత్రమే మన సంప్రదాయార్థాలు అర్థం అవుతాయి. లేకపోతే, విపరీతమైన అర్థాలే తోస్తాయి. అందుచేత, ఇటువంటి సందర్భాలలో విశేషాలను ఆచార్యుల సన్నిధిలో విని తెలియవలసి ఉన్నది)

(ఆత్మభావమ్) తన స్వభావాన్ని అని అర్థం. ఇక్కడ ఉదాహరణంగా చూపబడిన విషయంలోని వాస్తవాన్ని లోతుగా గమనించి తెలియాలి. అయస్కాంతం, దానివల్ల ఆకర్షింపబడిన ఇనుము అనే రెండు చివరిలో ఒకటిగా కావడం లేదు. వేరువేరుగానే ఉంటున్నాయి. అయినప్పటికీ, అయస్కాంతానికి వశపడిన వేరుగా ఉండే ఇనుప ముక్క అయస్కాంతానికి కల స్థితులను అన్నిటిని తాను పొందుతున్నది. ఆ విధంగానే, అగ్నిలో పెట్టబడిన బంగారం, అగ్ని రెండు ఒకే వస్తువుగా కావడం లేదు. వేరుగా ఉండే అగ్ని యొక్క పరిశుద్ధ స్వభావాన్ని బంగారం పొందుతున్నది. ఈ విధంగానే బ్రహ్మధ్యానం చేసి, చివరిలో అందులో లయాన్ని పొంది మోక్షాన్ని పొందిన జీవుడు మోక్షదశలో కూడా పరమాత్మ కంటే వేరుగానే ఉంటాడు. అయినప్పటికీ, పరమాత్మ ధర్మాలను చాలా వాటిని పొంది, బ్రహ్మంవంటివాడుగా ముక్తుడు అవుతున్నాడు.

మనసును భగవంతునిలోనే నిలిప, స్థిరంగా ఉండేటట్లు చేయడమే యోగం. అనాదికాలంగా ఈ మనస్సు మిగిలిన విషయాలలోనే ఆసక్తిని పొంది

ఉన్నది. భగవంతుడు అయితే, కొత్త విషయం. ఇంతకుముందే అనుభవింపబడిన విషయం కాదు. ఇంత కాలంగా అనుభవించి అలవాటు పడిన వస్తువుల నుండి తటాలున మనస్సును వివర్తింపచేయడం అంత సాధ్యం కాదు. అపూర్వమైన భగవద్విషయంలో మనసును చేర్చాలి అంటే, దానికి చాలా ప్రయత్నం చేయవలసి ఉన్నది. ఆ విధంగా భగవంతుని భావించేటప్పుడు నిరంతరంగా వేరొక భావన మధ్యలో రాకుండా ఉండేటట్లు ఆ భగవంతుని అనవరతం స్మరించాలి. ప్రత్యక్షంవలె ఈ స్మృతియే, అంటే, నిరంతరం చేసే భావనయే, బ్రహ్మను ప్రత్యక్షంగా దర్శింప చేసేదిగా ఏర్పడాలి. ఆనందరూపంగా ఈ భావనయే మారుతుంది. ఇటువంటి మనఃస్థితిని, అంటే, భావనను, అంటే, స్మృతిని భగవంతుని విషయంలో చేర్చడమే యోగం. యోగం అనేదానికి సంయోగం చేర్చడం – అనేదే అర్థం.

ఆత్మప్రయత్నసాపేక్షా విశిష్టా యా మనోగతిః,
తస్యా బ్రహ్మణి సంయోగే యోగ ఇత్యభిధీయతే.

ఈ విధమైన యోగాన్ని మోక్షంకోసం చేసేవాడు యోగి అవుతున్నాడు. ఈ మొట్టమొదటగా ప్రవేశించినవాడు, ధ్యానం ఆరంభించే దశలో ఉండేవాడు "యుంజానః "అని, "యోగయుక్"అని చెప్పబడుతున్నాడు.పరమాత్మ సాక్షాత్కారం పొందినవాడు "వినిష్పన్న సమాధిః"– సమాధిని చేజిక్కించుకున్నవాడు– అని చెప్పబడుతున్నాడు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యానాలనే ఏడు అంగాలతో కూడినదిగా ఉండే సమాధియే యోగం అని చెప్పబడుతున్నది. ఈ క్రమంలో 6 అంగాలతో కూడిన జ్ఞానంతో నిలచేవాడు "యోగయుక్"అనే పేరును పొందుతున్నాడు. చివరిది అయిన సమాధి కూడా చేకూరినట్లయితే, (సిద్ధించినట్లయితే) అతడు "వినిష్పన్న సమాధి"అని, యోగి అని పేరును పొందుతున్నాడు. వీరిలో, మొదటివాడు అయిన "యుంజానః "అనేవానికి

మధ్యలో ఎన్నో ఆటంకాలు ఏర్పడి, మనసు చలించినట్లయితే, మోక్షం సిద్ధించడం ఆలస్యం అవుతుంది. తరువాత పలు జన్మలలో అతడు యోగాన్ని చేసి, అది పూర్తి అయిన తరువాతనే మోక్షం కలుగుతుంది. రెండవవాడు అయిన "వినిష్పన్న సమాధి"అనేవాడు ఆ జన్మలోని చివరలోనే మోక్షాన్ని పొందుతున్నాడు. ఆతని మోక్షానికి అడ్డుగా ఉండే పాపాలను అన్నిటిని ఇతడు చేసి ముగించిన ధ్యానమే పోగొట్టడం చేత, మోక్షానికి ఆలస్యం ఏమీ ఉండదు. వెంటనే అది సిద్ధిస్తుంది.

ఈ యోగి తన మనస్సు యోగం చేయడానికి అనువైన యోగ్యతను పొందడం కోసం బ్రహ్మచర్యం, అహింస, సత్యమే చెప్పడం,దొంగతనం చేయకపోవడం,తగనివారి దగ్గర నుండి దేనిని తీసుకోకపోవడం, వేదాధ్యయనం, పరిశుద్ధి, సంతోషం, తపస్సు అనే యమ నియమాలను వేరు ఏ ప్రయోజనాలను ఆశించకుండా చేస్తూ, పరబ్రహ్మ విషయంలో మనస్సును నిలుపుకోవాలి.

వీటిలో –బ్రహ్మచర్యం, అహింస, సత్యం, దొంగతనం చేయకపోవడం, దానం గ్రహించకపోవడం –అనే ఈ ఐదు యమం అనే పేరు కలిగిన యోగాంగం అవుతున్నాయి. ఆ విధంగానే, స్వాధ్యాయం, పరిశుద్ధి, సంతోషం, తపస్సు మొదలైన కాయశోషణం, పరమాత్మ విషయంలో మనస్సును అభినివేశాన్ని కలిగి ఉండడం – అనే ఈ ఐదు నియమం అనబడే యోగాంగం అవుతున్నాయి. ఏదైనా ఒక ప్రయోజనాన్ని ఆశించి, వీటిని చేస్తే,ఆ ప్రయోజనాన్ని అవి ఇస్తాయి. ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా చేస్తే, అతనికి ఇవే సమాధిని పెంపొందించడం ద్వారా మోక్షానికి కారణాలు అవుతాయి.

**ఆసనం**

యమ నియమాలతో కూడిన యోగి పద్మాసనం స్వస్తికాసనం, మొదలైన ఆసనాలలో ఏదైనా ఒక ఆసనాన్ని గ్రహించి యోగాన్ని అభ్యసించాలి.

**ప్రాణాయామం**

ప్రాణం అనే వాయువును అభ్యాసంచేత వశం చేసుకోవడమే ప్రాణాయామం అనబడుతుంది. ఈ ప్రాణాయామం సబీజం అని, అబీజం అని రెండు విధాలుగా ఉంటుంది. వీటిలో, మూర్తిధ్యానం, మంత్ర జపం అనే వీటితో కూడిన ప్రాణాయామం సబీజం అనబడుతుంది. ఇవి లేనిది అబీజం అనబడుతుంది. ఇంకొక రీతిలో ఈ ప్రాణాయామమే రేచకం, పూరకం, కుంభకం అని మూడు విధాలుగా ఉంటుంది. ఊపిరిని విడిచేటప్పుడు, అంటే, ఉచ్ఛ్వాసాన్ని చేసేటప్పుడు, నోటి ద్వారా విడిచే గాలి ప్రాణం అని అనబడుతుంది. నిఃశ్వాసం చేసేటప్పుడు, శరీరం లోపల ప్రవేశించే గాలి అపానం అనబడుతుంది. ప్రాణాన్ని గ్రహించి, అపానాన్ని నియంత్రించడం, అంటే, లోపలకు గాలిని ఆకర్షించడం నిలిపి, లోపల ఉండే గాలిని బయటకు విడువడం మాత్రం చేయడం రేచకం అవుతుంది. ఆ విధంగానే అపానాన్ని గ్ర హించి, ప్రాణాన్ని నియంత్రించడం, అంటే, గాలిని బయటకు విడవడానికి నిలిపివేసి, లోపలకు గ్రహించడం మాత్రం, నిఃశ్వాసాన్ని మాత్రం చేయడం పూరకం అవుతుంది. ఈ విధంగా ఉండే ఉచ్ఛ్వాసాన్ని, నిఃశ్వాసాన్ని, రెండిటిని – వాయువును బయటకు విడువడాన్ని, లోపలకు గ్రహించడాన్ని చేయకుండా, హృదయంలోనే నిలిపి ఉంచడం కుంభకం అనబడుతుంది సబీజ ప్రాణాయామాన్ని, సావలంబన ప్రాణాయామాన్ని యోగి చేసేటప్పుడు ఆలంబనంగా, అంటే, మనసుకు ఆలంబనంగా అనంతుని స్థూలరూపాన్నే గ్రహించాలి.

ప్రత్యాహారం

యోగాన్ని చేసేవాడు– శబ్దం మొదలైన విషయాలలో ఆసక్తిని పొంది ఉండే చెవి మొదలైన ఇంద్రియాలను ఆ విషయాలనుండి నివర్తింపజేసి, వాటిని మనసుకు పశమైనవిగా చేయాలి భగవంతుని తప్ప మిగిలిన విషయాలలో మనస్సు ప్రవర్తించకుండా చేయాలి. దీనికే ప్రత్యాహారం అని పేరు. ఇందువల్ల ఇంద్రియ జయం కలుగుతుంది. సహజంగానే ఇంద్రియాలు చాలా చంచలమైనవి. విషయాలను అవి అన్వేషిస్తూ ఉంటాయి. ఆ విధంగానే, ఇంద్రియాలను విడచి పెడితే, యోగం ఏనాటికి సిద్ధించదు. అందుచేత పూర్వం చెప్పిన విధంగా ప్రాణాయామంతో ప్రాణాన్ని, ప్రత్యాహారంతో ఇంద్రియాలను వశం చేసుకోవాలి.

ధారణ

ఈ విధంగా ఈ రెండిటిని వశం చేసుకొన్న తరువాత, మనసును భగవంతుని దివ్య మంగళ విగ్రహంలో స్థిరంగా నిలచేటట్లు చేసుకోవాలి. భగవంతుని దివ్య మంగళ విగ్రహానికి శుభాశ్రయం అని పేరు. ఇదే ముందు చెప్పిన భగవంతుని స్థూలరూపం అవుతుంది. ఇందులో మనసును స్థిరంగా నిలుపుకోవడమే ధారణ అనే అంగం అవుతున్నది.

మూడు విధాలైన భావనలు

ఈ శుభాశ్రయాన్ని ఆశ్రయించి నిలచి ఉండే మనస్సే రాగాదిదోషాలు కలుగకుండా ఉండేటట్లు అడ్డుకుంటుంది. సాధారణంగా మనస్సుకు ఆశ్రయమైనది బ్రహ్మమే. [ఇక్కడ బ్రహ్మశబ్దం పరబ్రహ్మను ఆత్మగా కలిగిన బద్ధముక్త జీవులను నిర్దేశిస్తుంది. పరబ్రహ్మకు శరీరంగా ఉండే జీవులను చేర్చే పైన ధ్యానం చేయవలసి ఉన్నందున, ఇప్పుడు ధారణ అనే కాలంలో వీటిని తొలగించగానే, భగవంతుని

మిగిలిన రూపాలకు, దివ్యమంగళ విగ్రహానికి (అంటే, శుభాశ్రయానికి) ఉండే వైలక్షణ్యాన్ని మహర్షి ఇక్కడ తెలుపుతున్నారు.]

ఈ బ్రహ్మం మూర్తం అని, అమూర్తం అని రెండు విధాలుగా ఉంటుంది. వీటిలో, మూర్తం అనే బ్రహ్మం– శరీరంతో కూడిన హిరణ్యగర్భుడు మొదలైన బద్ధజీవరూపమే. దీనిని అపరం అని అంటారు.అమూర్తం అనే బ్రహ్మం– శరీర సంబంధం తొలగిన ముక్త జీవరూపం. దీనికి పరం అని పేరు. ఈ విధంగా ముర్తామూర్త రూపంలో ఉండే ప్రపంచం మూడు విధాలయిన భావనలతో కూడి ఉన్నది.బ్రహ్మభావన, కర్మ భావన, ఉభయ భావన అనేవి ఆ మూడు భావనలు.

భావన అనేది విడువకుండా నిరంతరంగా భావించడం అనే మనోవ్యాపారం. బ్రహ్మాన్ని గూర్చి ఎల్లప్పుడు భావించడం బ్రహ్మభావన అనబడుతుంది. కర్మను గూర్చి ఎల్లప్పుడు భావించడం కర్మ భావన అనబడుతుంది. రెండిటిని భావించడం కుభయ భావన అనబడుతుంది. సనకసనందనాదులు బ్రహ్మభావనను చేసేవారు. దేవతలు మొదలు దానవులవరకు ఉండేవారు కర్మభావనతో కూడినవారు. హిరణ్యగర్భుడు మొదలైనవారి విషయంలో జ్ఞానం, అధికారం అనే రెండు ఉండడం చేత, ఉభయ భావనలు వారితో ఉన్నాయి. దేవతలు, మానవులు అనే తేడాలు అన్నీ శరీరం వల్లనే ఏర్పడుతున్నవి.. జీవస్వరూపంలో దేవత్వం, మానవత్వం మొదలైనవి ఏమీ లేవు. ఈ నిజాన్ని తెలియకుండా, దేవ మనుష్యాది భేదాలను చూచి ఆత్మల మధ్య దేవ మనుష్యాది భేదాన్ని భావించడం భావనకు తగినట్లు చేసే కార్యాలు నశించే వరకు పూర్వం చెప్పిన మూర్త బ్రహ్మం ఉంటుంది. అమూర్తమైన భేద జ్ఞానాన్ని కలిగిన బద్ధుల కంటే వేరైనది ముక్తరూపం.

ఈ ముక్తజీవ రూపంలో శరీరం లేనందువల్ల శరీరం కారణంగా ఏర్పడే జాతి భేదం అనేది దానిలో లేదు. నాశం మొదలైన మార్పులు లేనిది,ఇది. అందుచేత

రూపంతో నిర్దేశించడానికి వీలు కానిది. స్వయం ప్రకాశమైనది. వేరొక దేని సహాయ లేకుండానే తానే ప్రకాశించేది అవుతున్నది. జ్ఞాన స్వరూపం అని భావం. జ్ఞానాన్ని ముఖ్య గుణంగా కలిగి ఉన్నది కూడా. ఇటువంటి ముక్తజీవస్వరూపం బ్రహ్మాన్ని ఆత్మగా కలిగి ఉన్నందున బ్రహ్మం అనే పేరును పొంది ఉన్నది.

ప్రత్యస్తమితభేదం యత్ సత్తామాత్ర మగోచరమ్,
వచసా మాత్మసంవేద్యం తద్ జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్

ఇదే అమూర్తం, పరం అయిన విష్ణువుయొక్క రూపం. ఇంతకు ముందు తెలిపిన మూర్త రూపం కంటే పూర్తిగా వేరయినది. ఇటువంటి ఈ పర రూపాన్ని యోగం ఆరంభ దశలో ఉండేవాడు ధ్యానించడం సాధ్యం కాదు. అందుచేత, ముందు చెప్పిన మూర్త రూపమే ఇతని చింతనకు తగినది అవుతున్నది. గంధర్వులు, యక్షులు, ధైత్యులు మొదలైన దేవజాతులు, మానవులు, పశువులు, పర్వతాలు,సముద్రాలు, నదులు వృక్షాలు, ఇంకా మిగిలిన భూతాలు, భూతకారణాలు ఈ విధంగా ఉండే చేతనాలుగా, అచేతనాలుగా, ఒకే పాదాన్ని,రెండు పాదాలను, పలు పాదాలను కలిగినవిగాను, పాదాలే లేనివిగాను ఉండే అన్నీ భగవంతుని మూర్తరూపాలు.

ఇటువంటి భగవంతుని రూపం చింతనకు తగినది అయినప్పటికీ (మనస్సుకు ఆశ్రయంగా ఉన్నప్పటికీ), ఇంతకు ముందు చెప్పబడిన మూడు భావనలతో కూడి ఉండడం చేత, అశుభమై ఉన్నవి, అంటే, శుభాశ్రయం కాకుండా ఉన్నవి. (చింతనను చేసే వారి దోషాన్ని, సంసార దుఃఖాన్ని తీర్చేది ఏదో, అదే శుభం అవుతుంది. చింతనకు తగినది, ఆశ్రయం అవుతున్నది. అందుచేత శుభంగానూ, ఆశ్రయంగాను ఉండే రూపం పైన తెలిపిన మూర్తరూపం కాబోదు. భగవంతుని దివ్యమంగళ విగ్రహమే శుభాశ్రయం అవుతుంది) ఇటువంటి లోకం అంతా విష్ణువు

యొక్క శక్తిగా, అంశంగా ఉన్నది. ఈ విష్ణుశక్తి,–పరశక్తి, క్షేత్రజ్ఞ శక్తి,కర్మ శక్తి అని మూడు విధాలుగా ఉన్నది. పూర్వం తెలిపిన మూర్తస్వరూపం పరశక్తి అవుతుంది. బద్ధజీవస్వరూపం క్షేత్రజ్ఞశక్తి అవుతుంది. యాగం మొదలైన కర్మలు కర్మ శక్తి అవుతుంది. దీనికే అవిద్య అనే ఇంకొక పేరు కూడా ఉన్నది. బద్ద జీవులు ఈ కర్మ శక్తి చేత, అంటే, అవిద్య చేత ఆవరింపబడి, సంసారతాపాలను అన్నిటినీ పొందుతున్నారు. క్షేత్రజ్ఞ శక్తి అనే జీవాత్మలు ఈ అవిద్యాశక్తి చేత ఆవరింపబడి, ఆయా శరీరానికి తగినట్లుగా జ్ఞానం, ఆనందం మొదలైన వాటిలో తారతమ్యాన్ని పొందుతున్నారు. చైతన్యం లేని శిలలు, కట్టెలు మొదలైనవానిలో ఉండే జీవునకు జ్ఞానం అంతా చాలా తక్కువ. ఇందువల్ల శిలలు, వృక్ష ఖండాలు మొదలైనవాటిలోకూడా జీవుడు ఉన్నాడు– అనే సిద్ధాంతాన్ని తెలియాలి) స్థావరాలలో,జ్ఞానం మొదలైన గుణాలు ముందు చెప్పబడినవాటి కంటే కొంచెం అధికంగా ఉంటాయి. వీటి కంటే సర్పాలు మొదలైన పాకే జంతువులలోనూ, వీటి కంటే పక్షులలోనూ, వీటి కంటే మృగాలలోను, వీటి కంటే మానవులలోనూ,వీరి కంటే దేవతలలోనూ, వీరి కంటే ఇంద్రునిలోనూ, ఇతని కంటే ప్రజాపతులలోనూ, వీరి కంటే హిరణ్య గర్భునిలోనూ జ్ఞానం, ఆనందం మొదలైన గుణాలు అధికంగా గోచరిస్తాయి. ఈ హెచ్చుతగ్గులకు వారు వారు చేసుకున్న కర్మలే కారణం.పూర్తి వెలను ఇచ్చి కొనే కట్టెలు చక్కగా మండుతాయి. ఆ విధంగానే, మంచి కర్మలను చేసి పొందే శరీరం కూడా గొప్పగా వెలుగుతుంది. ఇందువల్ల దీనితో సంబంధం కలిగిన ఆత్మ యొక్క గుణాలు కూడా గొప్పగా వెలుగుతాయి. ఇంతకు ముందు చెప్పబడినవి అన్నీ భగవంతుని శరీరాలే. భగవంతుని శక్తి సంకల్పాలతోనే ఇవి అన్ని ఆవరింపబడి ఉన్నాయి.

భగవంతుని అమూర్తమైన రూపమే పండితులచే "సత్ "అని చెప్పబడుతున్నది. ఇదే యోగంలో వికాసాన్ని పొందినవానిచేత ధ్యానించదగిన రూపం అవుతున్నది.

**శుభాశ్రయం**

ఇంతకు ముందు చెప్పిన మూడు విధాలయిన శక్తులకు ఆశ్రయమైనది, ఇంతకు ముందు చెప్పిన విశ్వరూపం కంటే వేరయినది, గుణం మొదలైన వాటితో అతిశయాన్ని పొందినది అయిన భగవంతుని ఇంకొక రూపం ఉన్నది.

**సమస్తశక్తయ శ్చైతాః నృప యత్ర ప్రతిష్ఠితాః,**
**తద్విశ్వరూప వైరూప్యం రూప మన్యద్ధరేర్మహత్.**

ఈ రూపం నుండి భగవంతుడు అనేక విధాలైన అవతార రూపాలను ఎత్తుతున్నాడు. ఈ అవతార రూపాలు ఎన్నో విధాలుగా ఉన్నాయి. దేవజాతిలో ఉపేంద్రునిగా అవతరించి దేవతల కార్యాలను నిర్వహించాడు. మీనంగా అవతరించి తిర్యక్కుల చేష్టలను అనుసరించాడు. రామకృష్ణాధిరూపాలలో అవతరించి,మనుష్య చేష్టలను పరిగ్రహించాడు. దీనితో నిలువకుండా, నరసింహంగా కూడా అవతరించాడు. అన్ని అవతారాలకు కూడా కారణంగా ఉండేది ఈ రూపమే అవుతున్నది.

ఈ విధంగా భగవంతుడు అవతరించి చేసే కార్యాలు అన్నీ అతని లీలలే అవుతున్నాయి. మిగిలిన ఏ ప్రయోజనాలను భావించి చేయబడేవి కాదు. లోకోపకారం కోసమే ఇవి ఏర్పడేవి. మనం చేసే కార్యాలవలె కర్మ కారణంగా ఏర్పడేవి కావు, ఇవి. వీటిని మనసుతో పరిచ్ఛేదించి తెలుసుకోవడం సాధ్యం కాదు. వాటికి ఏ సమయంలోనూ అడ్డు అనేది లేదు.

ఇటువంటి, గొప్పతనాన్ని కలిగిన అవతారాలకు అన్నిటికీ కారణం ఈ రూపమే. యోగాన్ని చేయడానికి ఆరంభించినవాడు అభ్యాసంచేత ఈ రూపాన్నే ఉపాసించాలి. ఈ రూపాన్ని ఉపాసిస్తే, పాపాలు అన్నీ తొలగిపోయి, ఆత్మశుద్ధి కలుగుతుంది. అందువల్ల ఉపాసకుని పాపాలను పోగొట్టేది ఈ రూపమే. అగ్ని మండి పైకి ఎగసి, ముళ్ళ పొదలను దహించేటట్లు, యోగుల హృదయంలో ఉంటూ భగవంతుడు అన్ని పాపాలను పోగొడుతున్నాడు. అందుచేత, ఇటువంటి ఈ రూపంలో మనసును నిలకడగా నిలపాలి. ఇదే ధారణ అని అనబడే అంగం అవుతున్నది.

ఈ ధారణకు విషయంగా – పాపాలను పోగొట్టడం వల్లనే ఈ రూపానికి శుభాశ్రయం, అంటే, శుభాలకు ఆశ్రయం అయినది – అనే అర్థం గ్రహించకూడదు. శుభంగానూ, ఆశ్రయంగాను (శుభం చ, ఆశ్రయం చ) ఉన్నది అనే అర్థమే గ్రహించాలి. ఉపాసకుని ఉపాసనాన్ని వృద్ధి చేయడం వల్ల శుభంగాను, ధారణకు ఆశ్రయంగా, అంటే, విషయంగా ఉన్నదానివల్ల ఆశయంగాను అవుతున్నది, ఈ రూపం– అని తాత్పర్యం. ఈ స్వభావాలు రెండు మిగిలిన దేనికీ లేవు. భగవంతుని ఆత్మ స్వరూపం కూడా ఉపాసకుని పాపాన్ని పోగొట్టగలిగినదే, శుభమైనదే అయినా, అది ఉపాసన ఆరంభంలో ఉండేవాని ధారణకు విషయం కానందు వల్ల, అది ఆశ్రయం కాదు. ఈ విధంగా శుభంగానూ, ఆశ్రయంగాను ఉండే స్వభావం (శుభత్వే సతి ఆశ్రయత్వం) దివ్యాత్మ స్వరూపానికి లేదు.

మిగిలిన బద్ధముక్త జీవుల రూపం అయితే, ఆశ్రయంగా ఉపాసకుని ధారణకు విషయమై ఉన్నప్పటికీ, ఉపాసకుని పాపాలను పోగొట్టలేదు. పూర్వం చెప్పిన మూడు విధాలయిన భావనలతో కూడి ఉన్నందున అవి అన్ని అశుభాలే అవుతున్నాయి. అందుచేత అవి ధారణకు ఆశ్రయాలు అయినప్పటికీ శుభాలు

కావు. శుభంగా ఉండడం, ఆశ్రయమై ఉండడం– అనే ఈ రెండు స్వభావాలు పొందికగా ఉండే శుభాశ్రయంగా ఉండేది భగవంతుని ఈ రూపమే.

ఎక్కడెక్కడో తిరిగి తిరిగి, అలసిపోయిన తరువాత, విలక్షణమైన విషయాన్ని ఆశ్రయించి స్థిరంగా ఉండే మనసుకు ఆలంబనంగా, ఆశయంగా ఉండేది, యోగులకు సంసారాన్ని పోగొట్టి,మోక్షాన్ని అనుగ్రహించేది అయినందున, శుభంగా ఉండేది భగవంతుని ఈ దివ్యరూపమే.

దీనిని వదిలిపెట్టి, మిగిలిన దేవతలు మొదలుగా అందరూ మనస్సుకు విషయంగా ఉన్నప్పటికీ, వారు కర్మకు వశమై ఉండేవారు, కనుక, అశుద్ధులే, అంటే, శుద్ధిని లేనివారే అవుతున్నారు.

వేరు దేనిలోనూ ఆశను లేకుండా వదిలిపెట్టి, భగవంతుని దివ్య మంగళ విగ్రహంలో మనసును నిలపడమే ధారణ అవుతుంది. ఆరంభ దశలో ఉపవాసకుని మనసు ఆధారం లేకుండా,ఆలంబనం లేకుండా నిలువలేదు కదా. అటువంటి శుభాశ్రయమైన భగవంతుని దివ్య మంగళ విగ్రహం పరమ భోగ్యంగా ఉంటుంది.

దివ్యమంగళ విగ్రహసౌందర్యం

పూర్ణచంద్రునివంటి వదనం, నిండు నీటిలో పూచిన తామర పువ్వు వంటి విశాలమైన ఆ పెద్ద పెద్ద నేత్రాలు, అందమైన కపోలాలు, విశాలంగా విస్తరించిన ఫాలభాగం, సమానమైన పరిమాణంలో వేలాడే ప్రకాశం నిండుగా ఉండే కుండలాలు, ప్రకాశించే చెవులు, అందమైన శంఖంవంటి కంఠం, రెండు వైపులా శ్రీవత్సమనే పుట్టుమచ్చను, లక్ష్మీదేవిని కలిగి ఉండే వక్షఃస్థలం, ఉదరంలో ఉండే మూడు మడతలు, లోతుగా గుండ్రంగా ఉండే నాభి, దానిని కలిగి ప్రకాశించే ఉదరం, దీర్ఘంగా గుండ్రంగా ఉందడి వెలిగే నాలుగు లేక ఎనిమిది బాహువులు, సమమైన ఊరువులు, పిక్కలు,అరవిందం వంటి పాదాలు, నడుముకు అందాన్ని కలిగించే

పీతాంబరం, కిరీటం, హారాలు మొదలైన ఆభరణాలు అనేకం కలిగి ఉండి వెలిగే దివ్యతిరుమేనితో ప్రకాశించే విష్ణువు అనే పరబ్రహ్మాను ధ్యానించాలి.

నాలుగు విధాలైన ధారణలు

దివ్యాస్త్రాలు, దివ్యభూషణాలు, ప్రత్యంగాలు, ప్రధానాంగం– అనే నాలుగు విషయాలను ఆధారంగా చేసుకుని ఏర్పడే ధారణ మొదటి ధారణ అవుతున్నది. అంటే, కిరీటం, హారాలు మొదలైన భూషణాలు, శంఖం, చక్రం మొదలైన దివ్యాయుధాలు, వరదానముద్ర, అభయ ముద్ర మొదలైనవాటితో కూడిన శ్రీహస్తాలు మొదలైనవానితో కూడిన భగవంతుని రూపాన్ని ధ్యానించాలి.

భగవంతునకు ఎనిమిది బాహువులు ఉన్నాయి అని, నాలుగు బాహువులు ఉన్నాయి అని శాస్త్రాలు చెబుతున్నాయి. 8 బాహువులు అని భావిస్తే, వాటిలో క్రమంగా 6 బాహువులలో విల్లు, శంఖం, గద, ఖడ్గం, చక్రం, అక్షమాలలను,మిగిలిన రెండు బాహువులలో పద్మం, బాణం (లేక, వరదానముద్ర, లేక, అభయ ముద్ర) ఉన్నాయి అని భావించాలి. నాలుగు బాహువులు ఉన్నాయి అని భావిస్తే, శంఖం, చక్రం, గద, తామర పువ్వు అనే ఇవి ఉన్నాయి –అని భావించాలి ఇటువంటి రూపంలో మనస్సును స్థిరంగా నిలిచేటట్టు చేసి, మనసును నియంత్రించి, తన్మయుడై, ధారణ స్థిరంగా నిలిచే వరకు ధ్యానించాలి. నడిచేటప్పుడు, నిలిచేటప్పుడు వేరు ఏ కార్యాన్ని చేస్తూ ఉన్నప్పటికీ భగవంతుని ఈ రూపాన్ని మనసులో పెట్టుకొని విడవకుండా ఉన్నట్లయితే, ధారణ సుస్థిరంగా నిలచి ఉన్నది– అని తెలియవచ్చు.

మొదటగా, ఈ విధంగా అస్త్రాలు, భూషణాలు, ప్రత్యంగాలు, ప్రధానాంగం– అనే నాలుగు విధాలయిన విషయాలను గూర్చిన ధారణ స్థిరంగా ఏర్పడిన తరువాత, శంఖం, చక్రం మొదలైన అస్త్రాలను విడచిపెట్టి,అక్షమాల, కిరీటం

మొదలైన ఆభరణాలతో, ప్రత్యంగ ప్రధానంగాలతోనూ కూడి ఉండే ఆ తిరుమేనిని శాంతుడై ధ్యానించాలి. ఇది రెండవ ధారణ. ఇది కూడా నిలకడగా కలిగిన తరువాత, ఆయుధాలు, ఆభరణాలు అనేవి లేకుండా, ప్రత్యంగ ప్రధానాంగాలతో మాత్రం కూడినదిగా ఆ భగవంతుని తిరుమేనిని ధ్యానం చేయాలి. ఇది మూడవ విధమైన ధారణ. ఇది సిద్ధించిన తరువాత, అస్త్రాలు, భూషణాలు, ప్రత్యంగాలు అనే అన్నిటిని విడచిపెట్టి, తిరుమేనితో మాత్రం కూడినవానినిగా భగవంతుని ధ్యానించాలి. ఇది ఏకావయవప్రధానమైన చివరి ధారణ అవుతుంది.

ధ్యానం

ఈ విధంగా చెప్పబడిన ధారణ సిద్ధించిన తరువాత, ప్రత్యంగాలు, ప్రధానాంగం,అస్త్రాలు, భూషణాలు అనే వీటికి అన్నిటికి ఆశ్రయంగా ఉండే అవయవిని ధ్యానం చేయడంలో దృష్టిని కలవాడుగా ఉండాలి. ధారణతో చక్కగా ప్రకాశించే శుభాశ్రయాన్ని,అంటే, భగవంతుని దివ్య మంగళ విగ్రహాన్ని నిరంతరంగా ధ్యానించాలి. ఆ సమయంలో వేరు విషయాలను గూర్చిన భావన మధ్యలో ఉండకూడదు. ఈ విధంగా వేరొక విధమైన భావన ఏమీ లేకుండా, నిరంతరంగా శుభాశ్రయాన్ని గూర్చిన భావనలోని ప్రవాహమే ధ్యానం అనబడుతుంది. ఇది ఇంతకు ముందు తెలుపబడిన ఆసనం,ప్రాణాయామం, ప్రత్యాహారం, ధారణ అనే అంగాలతో ఏర్పడుతున్నది.

తద్రూప ప్రత్యయే చైకా సంతతి శ్చాన్యనిఃస్పృహా,
దతద్ జ్ఞానం ప్రథమైః షడ్భిరంగైః నిష్పాద్యతే నృప!.

ఇటువంటి ధ్యానం దివ్యమంగళ విగ్రహాన్ని ఆశ్రయించి, అంటే, దానిని విషయంగా చేసుకొని ఉన్నందువల్ల, సావలంబనయోగం అని, సబీజయోగం అని చెప్పబడుతున్నది.

ధ్యానం

ఇంతకుముందు చెప్పిన రీతిలో దివ్యమంగళ విగ్రహంతో కూడిన భగవంతుని ఆశ్రయించి ఉండే ధ్యానం, నామరూపాదుల కల్పన లేకుండా, ఆ భగవంతుని దివ్యాత్మస్వరూపాన్ని మాత్రం ఆశ్రయించి, దానిని విషయంగా కలిగి ఉండేది అయినట్లయితే, అదే సమాధి అని అనబడుతున్నది. ఇదే ఉపాసనం అని, భక్తి అని,పరవిద్య అని, వివేకజన్యజ్ఞానం అని ఇంతకు ముందు చెప్పబడింది.

తస్యైవ కల్పనా హీనం స్వరూపగ్రహణం హి యత్,
మనసా జ్ఞాననిష్పాద్యం సమాధి స్సో ఽ భిధీయతే.

ఇది, ఇంతకు ముందు చెప్పబడిన ధ్యానం వరకు ఉండే ఏడు అంగాలతో ఏర్పడుతున్నది. పరమ ఫలమైన, ప్రాప్యమైన, బ్రహ్మాన్ని పొందించే జ్ఞానం ఇదే అవుతున్నది. జ్ఞానంతో పొందవలసిన బ్రహ్మాన్ని పొందేవాడు మూడు విధానైన భావనలను లేని ఉపాసకుడైన ఆత్మయే అవుతున్నాడు. అందుచేత ప్రాప్యం, అంటే, పొందదగినది బ్రహ్మం. ప్రాపకం, అంటే, పొందించేది సమాధి అనే ఉపాసనం.. ప్రాపణీయుడు (పొందింపబడేవాడు) ఉపాసకుడైన ఆత్మ. ఈ సమాధి జ్ఞానం ఇతనికి మోక్షాన్ని ఇస్తున్నది. అనాదికాలంగా శరీర సంబంధమైన మాయచేత ఆవరింపబడిన స్వరూపాన్ని కలిగిన జీవాత్మ ఉపాసనం అనే కారణాన్ని, అంటే, సాధనాన్ని గ్రహించి, మోక్షాన్ని పొందుతున్నాడు. అందుచేత, మోక్షాన్ని పొందడానికి ఈ ఉపాసనా జ్ఞానం కారణంగా, సాధనంగా ఉన్నది. ఇది మోక్షాన్ని ఇచ్చి, తన కృత్యాన్ని నెరవేరుస్తున్నది.మోక్షాన్ని ఇచ్చే పర్యంతానికి ఈ ఉపాసనం సహాయపడుతున్నది. ఉపాసనం అనేది భగవంతుని, తనను అనుష్ఠించేవాని విషయంలో, అంటే, ఉపాసకుని విషయంలో అనుగ్రహాన్ని కలిగించి, మోక్షాన్ని ఇచ్చేటట్లు చేస్తున్నది – అని ఇక్కడ తాత్పర్యం.

**మోక్షంలో కూడా భేదమే.**

ముక్తిని పొందిన జీవాత్మ– పరమాత్మ యొక్క ధర్మాలను తాను కూడా పొందుతున్నాడు. పరమాత్మ యొక్క ధర్మాలను, అపహతపాప్మత్వం మొదలైన గుణాలను, మోక్షం పొందిన జీవుడు పొందుతున్నాడు. వెంటనే, పరమాత్మతో అభేది, భేదం లేనివాడై, అవుతున్నాడు. అంటే, జ్ఞానం,ఆనందం మొదలైన గుణాలతో భగవంతునితో సమానుడుగా, ఆనందం మొదలైన గుణాలలో భగవానునితో సమానుడుగా,ఏ తేడా లేకుండా అవుతున్నాడు. పూర్వం, ఇతడు బద్ధుడుగా ఉండేటప్పుడు ఉండే దేవాది శరీర సంబంధం కర్మవశంచేత ఏర్పడింది. అందుచేత కర్మం అంతా తీరగానే, ఆ దేవాదిశరీరం అనే భేదం కూడా తొలగిపోతున్నది.

**తద్భావభావ మాపన్నః తతో ౽ సౌ పరమాత్మనః,**
**భవత్యభేదీ భేదశ్చ తస్యాజ్ఞానకృతో భవేత్.**

ఈ శ్లోకం, మోక్షంలో జీవునకు పరమాత్మకు అభేదమే ఉన్నదని అర్థాన్ని చెబుతున్నట్లుగా అద్వైతాచార్యులు వ్యాఖ్యానం చేశారు. మోక్షంలో కూడా భేదమే ఉన్నది– అనేదానిని తెలిపేది అని మన పూర్వాచార్యుల సిద్ధాంతం. "తద్భావభావ మాపన్నః"అనే ప్రయోగంలోని స్వారస్యాన్ని గమనిస్తే,ఈ శ్లోకం చూపే వాస్తవమైన అర్థాన్ని చక్కగా గ్రహించవచ్చు. జీవుడు, పరమాత్మ కూడా మోక్షంలో అభేదాన్ని పొందుతున్నారు. ఇద్దరూ రెండుగా కలసి ఒకటిగా అవుతున్నారు, అంటే, జీవులు జీవస్వభావాన్ని పోగొట్టుకొని, పరబ్రహ్మగానే అవుతున్నారు– అని కదా అద్వైతుల సిద్ధాంతం. ఈ విధంగా అయినట్లయి , శ్లోకంలో "తద్భావమాపన్నః"అని ఉంటేనే సరిపోతుంది. ఆ విధంగా కాకుండా, "తద్భావభావమాపన్నః "అని రెండు భావశబ్దాలను ప్రయోగించడం వ్యర్థం అవుతుంది. ముక్తిని పొందిన జీవుడు తద్భావాన్ని,అంటే, బ్రహ్మ భావాన్ని పొందాడు–అనే అర్థం ముగిసిపోయింది కదా.

ఈ విధంగా ఉండగా, ఇంకా అధికంగా ఇంకొక భావశబ్దాన్ని మహర్షి ప్రయోగించడాన్ని బట్టి మోక్షంలో కూడా జీవాత్మకు, పరమాత్మకు మధ్య భేదమే ఉన్నది –అని ఏర్పడుతున్నది. "తద్భావాః – తస్య భావాః"– పరమాత్మ యొక్క ధర్మాలను, అంటే అపాహతపాప్మత్వం మొదలైనవానిని– అని అర్థం. తేషాం ధర్మాణాం భావం"– ఈ ధర్మాల ఆవిర్భావాన్ని పొందుతున్నాడు– అని అర్థం. అపహతపాప్మత్వం మొదలైనవి భగవంతునకు వలె జీవాత్మకు కూడా సహజంగా ఉన్నాయి అయితే, అవి కర్మవశంచేత సంసార దశలో మరుగుపడి ఉండిపోయాయి. జీవుడు మోక్షం పొందగానే, అవి ఆవిర్భావాన్ని పొందుతున్నాయి. అందుచేత ఇతడు పరమాత్మతో ఏ తేడా లేకుండా అవుతున్నాడు– అనేదే ఋజువైన అర్థం. అందుచేత, మోక్షంలో కూడా జీవునకు, పరమాత్మకు మధ్య భేదమే ఉన్నది అయినప్పటికీ విభాగించి తెలుసుకోవడం సాధ్యం కాదు. ఈ అర్థంలో రెండు భావశబ్దాలు అర్థవంతాలు అవుతాయి. (ఇక్కడ ఇంకా వివరాలను తెలియగోరేవారు తమ తమ ఆచార్యుల సన్నిధిలో ప్రార్థించి తెలియాలి)

సంసారదశలో ప్రతి జీవునకు తమను మానవునిగాను, దేవునిగానూ పలు విధాలుగా భావిస్తున్నారు. ఈ భేదం కర్మచేత ఏర్పడినది. నిజానికి అన్ని ఆత్మల స్వరూపం జ్ఞానానందమయంగానే ఉన్నందువల్ల, వాటిలో భేదమే లేదు. దేవ మనుష్యాదిభేదాన్ని కలిగించే కర్మలు మొత్తం పరమాత్మ దర్శనంతో నశించిన తరువాత, దాని కార్యమైన భేదం మాత్రం ఏ విధంగా అక్కడ అనువర్తిస్తుంది?. లేని జీవ పరమాత్మల భేదాన్ని ఎవడు కల్పించగలడు? తెలియగలడు? అందుచేత మోక్షంలో పరమాత్మ కంటే భిన్నుడై ఉండే జీవుడు ఇంతకుముందు కర్మవశంచేత ఏర్పడిన నామరూపాలను కోల్పోయి, విభాగించి తెలుసుకోవడానికి వీలు లేని విధంగా భగవంతునితో పరమసామ్యాన్ని పొందుతున్నాడు. ఇటువంటి మోక్షాన్ని

ఇచ్చేది ఈ సమాధియే"అని తనను ప్రశ్నించిన ఖాండిక్యునకు కేశిధ్వజుడు అష్టాంగ యోగాన్ని సంగ్రహవిస్తరంగా తెలిపి, "ఇంకా నీకు నేను చేయవలసినది ఏదైనా ఉన్నదా?"అని అడిగాడు.

దీనిని అంతటిని ఆలకించిన ఖాండిక్యుడు "కేశిధ్వజా! నా ప్రార్థనకు అంగీకరించి, అష్టాంగ యోగాన్ని పూర్తిగా మీరు ఉపదేశించారు. ఇందువల్ల నాకు అన్ని ఉపకారాలను చేసినవారయ్యారు. ఈ ఉపదేశం చేత నా మనసులో ఉండే అజ్ఞానం మొదలైన దోషాలు అన్నీ తొలగిపోయాయి. "నేను, నాది"అని దీనికి ముందు నేను చెప్పడం అంతా తప్పే.అయినా, లోకంలో పరమాత్మ సాక్షాత్కారం పొందినవారు కూడా "నేను, నాది "అని చెప్పడం తప్ప, వేరు విధంగా వ్యవహారం చేయడం సాధ్యం కాలేదు. "నేను, నాది"అని భావించడం అన్యధాజ్ఞానమే అవుతున్నది. ఇందువల్లనే, ఆడ,మగ, పశువులు, పక్షులు అనే భేదవ్యవహారాలు లోకంలో ఏర్పడుతున్నాయి.ఆత్మ స్వరూపం అయితే నాశం లేనిది. ఆడ, మగ అనే మాటలకు అందనిది. నాకు ఆవశ్యకమైన హితాలను అన్నిటిని మీరు చేశారు. ఇక మీరు వెళ్లి రండి"అని కేశిధ్వజునకు ఉపచరించి, అనుజ్ఞ ఇచ్చి పంపించి వేశాడు. అతడు కూడా ఆ విధంగానే తన నగరానికి చేరుకున్నాడు.

ఖాండిక్యుడు సిద్ధిని పొందాడు

ఖాండిక్యునకు మళ్ళీ రాజ్యం లభించింది. ఆ రాజ్యంలో తన కుమారుని ప్రభువుగా చేశాడు. తన మనసును భగవంతుని చరణాలలో నిలిపి, ధ్యానం చేయడానికి తగిన వనానికి వెళ్ళాడు. అక్కడ యమ నియమాది అంగాలను ఆచరించి, భగవంతుని ఎల్లప్పుడూ ధ్యానం చేసి, చివరిలో భగవంతునితో పరమసామ్యాన్ని పొందాడు.

కేశిధ్వజుడు కూడా మోక్షాన్ని పొందాలని కోరి, దానికి అడ్డుగా ఉండే కర్మలను పోగొట్టుకోవడం కోసం ప్రయత్నం చేసి, విషయాలను అనుభవిస్తూ వచ్చాడు. ఏ ప్రయోజనం కోరకుండా కర్మలను ఆచరిస్తూ ఉన్నాడు. సుఖదుఃఖానుభవాలతో పుణ్య పాపాలను అన్నిటిని పోగొట్టుకొని పవిత్రుడై, సంసారతాపాలను అన్నిటిని పోగొట్టే మోక్షాన్ని పొందాడు.

★★★★★

# ద్రౌపది శరణాగతి

కౌరవులతో ఆడిన జూదంలో పాండవులు ఓడిపోయారు. ద్రౌపదిని కూడా పణంగా పెట్టి ధర్మరాజు పోగొట్టుకున్నాడు. దుర్యోధనుని ఆజ్ఞ ప్రకారం దుశ్శాసనుడు ద్రౌపదిని బలాత్కారంగా తీసుకొని వచ్చి నిండు సభలో నిలబెట్టాడు. అందరి ముందు ఆమెను వివస్త్రను చేయమని దుర్యోధనుడు దుశ్శాసనుని ఆజ్ఞాపించాడు. అపడు ఆమె మాన సంరక్షణను చేయడానికి మహావీరులైన ఆమె భర్తలు పాండవులు ఐదుగురు కూడా అసమర్థులై మౌనంగా ఉండి పోయారు. తమని తాము కాపాడుకోలేనివారు ఇతరులను ఏ విధంగా రక్షించగలరు? ఆ సభలో భీష్ముడు, ద్రోణుడు వంటిమ పెద్దలు ఎంతోమంది ఉన్నారు. అయినప్పటికీ,వారు మౌనంగా ఆ దృశ్యాన్ని చూస్తూ ఉన్నారే తప్ప, ఆ అకార్యాన్ని అడ్డుకోలేకపోయారు.దుర్యోధనుడు చేసే ఆ దుష్కృత్యాన్ని అడ్డుకోవడానికి సాహసించలేని ధృతరాష్ట్రుని భగవద్రామానుజులు గీతాభాష్యావతారికలో "సర్వాత్మనా అంధః"– కేవలం బాహ్యనేత్రాన్ని మాత్రమే అతడు కోల్పోలేదు, అంతరమైన జ్ఞాననేత్రాన్ని కూడా కోల్పోయాడు– అని అన్నారు.

"ఎవరూ తనకు రక్షకులు కాలేరు"అని నిశ్చయించుకున్న తరువాత ద్రౌపది భగవానుడైన శ్రీ కృష్ణుని తన రక్షణ కోసం శరణాగతి చేసింది. "శంఖచక్రగదాపాణే! ద్వారకా నిలయాచ్యుత!, గోవింద! పుండరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్", అని ప్రార్థించింది. ". నీవు సదా శంఖచక్రాలను నీ చేతిలో ధరించకుండా ఉన్నట్లయితే, భక్తులకు ఆపద వచ్చినప్పుడు వాటిని నీవు ధరించి రావడానికి ఆలస్యం అవుతుంది అనే భావనతో ఎల్లప్పుడూ ఆ ఆయుధాలను చేతిలో ధరించి ఉన్నావు కదా. నీవు నన్ను ఇప్పుడు వాటితో రక్షించకపోయినట్లయితే, ఈ పంచ పాండవులు నన్ను

రక్షించడంలో అసమర్థులు అయినట్లుగానే, నీ పంచాయుధాలు కూడా భక్తరక్షణలో ఉపయోగ లేనివే అవుతాయి సుమా! నన్ను కాపాడు. నేను వైకుంఠనాథుని పిలువలేదు. ద్వారకా నగరంలో, సమీపంలో ఉండే నిన్ను కదా పిలుస్తున్నాను. భక్తుల రక్షణ నుండి చ్యుతి లేని అచ్యుతుడవైన నిన్ను కదా పిలుస్తున్నాను. "మమ్మలను కాపాడు", అని ప్రార్థించడం తెలియని గోవులను రక్షించే గోవిందుడవు కదా, నీవు.రక్షించమని అర్థించే నన్ను కాపాడవా? అందమైన తామర వంటి నేత్రాలను కలిగిన పుండరీకాక్షా! నీవు ఉండగానే నాకు ఈ పరాభవం జరగడాన్ని సహించి ఊరుకుంటావా? నన్ను రక్షించి అభయాన్ని ప్రసాదించు స్వామీ!"అని వేడుకొన్నది. ఆమె శరణాగతిని సార్థకంచేసి, భగవానుడు ఆమెకు వస్త్ర ప్రదానాన్ని చేసి, ఆమె మానసంరక్షణను చేశాడు. ఇది అందరికీ తెలిసిన వృత్తాంతం.

ఇందులోని పరమార్థం ఏమి?

ద్రౌపది అంటే జీవాత్మయే. కౌరవసభ అనేది ఇహలోక జీవనం. నూరు మంది కౌరవులు లౌకిక విషయాలు. కన్ను, ముక్కు, చెవి మొదలైన ఇంద్రియాలతో అనుభవించే పలు విషయానుభవాలే వారు.. ద్రౌపది అనే జీవాత్మకు వివేకజ్ఞానం అనే వస్త్రం ఆవరించి ఉన్నది. ఈ లౌకిక విషయ సుఖాలు జీవునకు గల ఈ వివేకజ్ఞానాన్ని దూరం చేయాలని చూడడమే కౌరవులు సభలో ద్రౌపది వస్త్రాన్ని తొలగించాలని చూడడం. జీవునకు ఐదు ఇంద్రియాలు ఉన్నాయి. అవే పంచ పాండవులు. జీవుని అయిదు ఇంద్రియాలు ఏ విధంగా ఉపయోగపడాలి? వేనిని అనుభవించి ఆనందించాలి? భగవంతుని విషయంలో అవి ఆసక్తమై,ఆ భగవంతుని సేవ చేసి ఆనందించాలి. కన్నులు భగవంతుని దర్శించాలి, చెవులు ఆ భగవంతుని కథలను వినాలి, వాక్కు ఆ భగవంతుని నామాలను పలకాలి. ఈ విధంగా అన్ని ఇంద్రియాలు

ఆ భగవంతునకే ఉపయోగపడాలి. కానీ,ఆ విధంగా కాకుండా, ఈ జీవుని ఇంద్రియాలు అన్ని లౌకిక విషయాలకు లోబడి, వాటికి దాస్యం చేయడమే పంచ పాండవులు కౌరవులకు వశమైపోవడం. పంచ పాండవులు అనే ఐదు ఇంద్రియాలు ద్రౌపది అనే జీవునకు వశం కాకుండా, కౌరవులు అనే లౌకిక విషయాలకు వశమైపోయాయి.

ఇటువంటి సమయంలో తగిన దారిని బుద్ధి చూపించాలి. అటువంటి బుద్ధి ఎవరంటే, భీష్ముడు, ద్రోణుడు మొదలైన పెద్దలు.కాని,. వారు మౌనంగా ఉండి పోయారు తప్ప, సరి అయిన మార్గాన్ని చూపించలేదు, ఉపదేశించలేదు. అప్పుడు జీవుడు అనే ద్రౌపదికి వివేకజ్ఞానం కోల్పోయే పరిస్థితి ఏర్పడింది.

ఇటువంటి విపత్కరమైన పరిస్థితిలో జీవుడు భగవంతుని శరణాగతి చేయడమే ద్రౌపది తనను రక్షించమని శ్రీకృష్ణుని ప్రార్థించడం. అప్పుడు భగవానుడు తన అనుగ్రహాన్ని ప్రసరింప చేసి, వివేకజ్ఞానాన్ని కలిగించడమే శ్రీకృష్ణుడు కరుణతో ద్రౌపదికి వస్త్రాన్ని అనుగ్రహించడం.

★★★★★

# పెరియవాచ్చాన్ పిళ్ళై వైభవం

(తిరుపతి ఉ.వే.శ్రీమాన్ టి. ఏ. కృష్ణమాచార్యస్వామివారి తమిళవ్యాసం ఆధారంగా)

శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమో యామునసూనవే,
యత్కటాక్షైకలక్ష్యాణాం సులభః శ్రీధరః సదా.

ఈ శ్లోకం పెరియవాచ్చాన్ పిళ్ళై తనియన్ శ్లోకం. "శ్రీ పెరియవాచ్చాన్ పిళ్ళై 'శ్రీకృష్ణ'లనే నామం కలవారు. వీరి తండ్రి పేరు 'యామునాచార్యులవారు'. అటువంటి పెరియవాచ్చాన్ పిళ్ళై కటాక్షాన్ని పొందిన అదృష్టం కలవారికి శ్రీధరుని (వేంకటేశ్వరుని) ఆశ్రయించడానికి, దర్శించి కైంకర్యం చేసుకోవడానికి సులభం అవుతుంది. అటువంటి పెరియవాచ్చాన్ పిళ్ళైకు నమస్కరిస్తున్నాను"– అనేది ఈ శ్లోకంలోని అర్థం. ఈ శ్లోకం ఎవరు రచించారు అనే విషయం స్పష్టంగా తెలియదు. "యత్కటాక్షణ లక్ష్యాణామ్"అనేది ప్రాచీన పుస్తకాలలోని పాఠం. "యత్కటాక్షైకలక్ష్యాణామ్"అనేది కూడా ఇంకొక పాఠం. ఎవరి కటాక్షానికి ముఖ్యంగా లక్ష్యం అయినవారికి – అనేది దీని అర్థం.

"శ్రీధరః"– శ్రియః పతి అనే అర్థం ప్రాచీనటీకలో కనిపిస్తున్నది. వీరు సకుటుంబంగా తిరుమలకు యాత్ర వెళ్ళినప్పుడు శ్రీ వేంకటేశ్వరుడు వీరికి తన విగ్రహాన్ని ఇచ్చినట్లు వీరి చరిత్రవల్ల తెలుస్తున్నది. ఇందువల్ల వీరి ఆరాధ్య దైవం అయిన శ్రీనివాసుడే, ఇక్కడ శ్రీధరుడుగా చెప్పబడ్డాడు అని చెప్పే అవకాశం ఉన్నందున ఆ విధంగానే ఇక్కడ అర్థం నిర్వహించబడుతున్నది. ఈ మహనీయులకు శ్రీనివాసుని విషయంలో ఉండే అభినివేశం చాలా గొప్పది అని వీరి వ్యాఖ్యానాలలో స్పష్టమవుతున్నది. "విణ్ణకరమ్ వెక్కా విరితిరైనీర్ వేఙ్గడమ్"(మూన్ఱామ్ తిరువందాది–62) అనే పాశురంలోని "విరైతిరైనీర్ వేఙ్గడమ్"అనే ప్రయోగానికి

"తిరుమలై ఎన్టాల్ ఒరు విశేషణరహితమాక శొల్లమాట్టార్. పరన్దు అలై ఎఱికిఱ నీర్వళప్పమ్ పొరున్దియ ఎన్ఱు సవిశేషణమాకవే శొల్లువర్"(తిరుమలై అంటే విశేషణం లేకుండా చెప్పరు. అలలు ఎగిసిపడే నీటి సమృద్ధిని కల అని సవిశేషణంగానే పలుకుతున్నారు) అని వీరు వివరించడం గమనించవచ్చు. పేయాళ్వారులు మూడవ తిరువందాది ప్రబంధంలోని పంతొమ్మిది పాశురాలలో తిరుమలను ప్రస్తావించారు. వాటిలో కొన్ని పాశురాలలో తిరుమలకు ఏ విశేషణం లేకుండా పలికినా, పలు పాశురాలలో వారు వేరు వేరు విశేషణాలతో చేర్చి పలకడం గమనించి తెలిసికొన్న పెరియవాచ్చాన్ పిళ్ళై, తిరుమల అంటే ఆళ్వారులు విశేషణరహితంగా చెప్పరు – అని అన్నారు. తిరుమలలో ఆళ్వారులకు ఉండే గౌరవం కంటే వ్యాఖ్యానకర్త అయిన వీరికి ఉండే అభినివేశం ఎక్కువ అని చెప్పవచ్చు. "అడిక్కీళ్ అమర్ న్దు పుకున్దు అడియార్ వాళ్ మిన్"(తిరువాయ్ మొళి–6–10–11) అనే సూక్తిని వ్యాఖ్యానం చేస్తూ "తన పాదాలలో అనన్య ప్రయోజనంగా ఆశ్రయించి శేషత్వజ్ఞానాన్ని కలవారై ఉజ్జీవించండి– అని హస్తముద్రతో పలుకుతున్నట్లు ఉన్నది, శ్రీవేంకటేశ్వరుడు ఉండే సన్నివేశం"అని ఈ వ్యాఖ్యాత నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో వివరించారు. శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలను, అతడు వాటిని తన కుడి చేతితో చూపిస్తూ వేంచేసి ఉండడాన్ని ఎల్లప్పుడూ మనసులో భావిస్తూ ఉన్నందువల్లే కదా ఈ వ్యాఖ్యాత ఇటువంటి సూక్తిని అనుగ్రహించారు. "హస్తముద్రైయాల్"అనే పదం వేరు ఏ వ్యాఖ్యానంలో లేనందున, ఈ సూక్తిని వీరికి శ్రీవేంకటేశ్వరుని విషయంలో ఉండే ఆదరానికి జ్ఞాపకంగా ఈ సూక్తిని భావించడంలో అడ్డు లేదు. ఇక్కడ ఇంకా వివరించవలసిన, ప్రస్తావించవలసిన సందర్భాలు చాలా ఉన్నా విస్తర భీతిచేత ఇంతటితో

విడువబడుతున్నది. అందువల్ల పెరియవాచ్చాన్ పిళ్లై అనుగ్రహించినవారికి శ్రీ వేంకటేశ్వరుడు సులభుడు కావడం నిశ్చయం కదా.

ఇక, "శ్రీమత్కృష్ణసమాహ్వాయ"అనే ప్రయోగానికి చెప్పే అర్థాన్ని గమనిద్దాం. "శ్రీమత్ కృష్ణః ఇతి సమాహ్వా యస్య సః"అని పూర్వం టీకలో తెలుపబడిన వివరణం కాకుండా, "శ్రీమత్ కృష్ణస్య సమాహ్వా సమీచీనా ఆహ్వా యస్య సః"అనే విగ్రహంతో శ్రీమత్ కృష్ణుడనే సత్యమైన, వాస్తవమైన పేరును కలిగినవారు అనే అర్థాన్ని గ్రహించి శ్రీకృష్ణ పరమాత్మకు కల గొప్ప పేరు అయిన మహాచార్యుడు అనే పేరును కలవారు ఈ యామునాచార్య పుత్రులు అనే అర్థాన్ని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడనే పేరుకు – అసురులను చంపి భూమి భారాన్ని తీర్చి, భూదేవికి సుఖాన్ని కలిగించేవాడు అని అర్థం. ఆ పేరు కంటే అతనికి ఏర్పడిన మహాచార్యుడు అనే పేరే చాలా గొప్పది. "అకల ఞానత్తవర్ అఱియ నెఱియెల్లామెడుత్తురైత్త నిఱైఞానత్తొరుమూర్ త్తి"(తిరువాయ్ మొழி–4–8–6) అని నమ్మాళ్వార్ లు కలిపిన రీతిలో గీతోపదేశం చేసినందున ఏర్పడిన మహాచార్యశబ్దం భూదేవికి భారం తీర్చినందున కలిగిన కృష్ణనామం కంటే చాలా గొప్పది కదా. శ్రీవరాహచరమ శ్లోకం, శ్రీరామచరమ శ్లోకం అనే రెండు చరమశ్లోకాలను అనుగ్రహించి ఆచార్య పదాన్ని నిర్వహించే శ్రీ వరాహ పెరుమాళ్ కంటే, శ్రీరామచంద్రుని కంటే 'గీతోపనిషత్' అని పేరు పొందిన 700 శ్లోకాలను కల చాలా గొప్ప శాస్త్రాన్ని అనుగ్రహించి మహాచార్యపదాన్ని నిర్వహించే శ్రీకృష్ణుడే కదా గొప్పవాడు. అతని పేర్లలో అసురులను వధించిన శక్తిచేత పొందిన కృష్ణుడనే నామం కంటే శాస్త్రాన్ని అంతటినీ ఉపదేశం చేసిన సంపూర్ణ జ్ఞానంతో పొందిన మహాచార్యుడు అనే నామం కదా చాలా గొప్పతనాన్ని కలిగినది. గీతాచార్యునకు ఆచార్యత్వం చెబితే చాలదా? మహాచార్యత్వం చెప్పాలా? అని అంటే,

మహాచార్యత్వం లోకంలో ప్రసిద్ధమైనందున దానిని కప్పిపుచ్చడానికి గాని కాదనడానికి గాని ఎవరికీ సాధ్యం కాదు. వరాహాచార్యులు, కూర్మాచార్యులు, వామనాచార్యులు అని కేవలం ఆచార్య శబ్దంతో చేర్చి వ్యవహరించే లోకం కృష్ణనామాన్ని కలిగినవారిని చెప్పేటప్పుడు కృష్ణమాచార్యులు అని మహాచార్యశబ్దంతో చేర్చే నిర్దేశించడం లోకంలో సుప్రసిద్ధం. కనుక కృష్ణుడే మహాచార్యుడు. కృష్ణమాచార్యులు అంటే కృష్ణమహాచార్యులు అని అర్థం. ఇప్పటికీ ఉత్తర దేశంలో ఉండే వారు కృష్ణమహాచార్యులు అని వ్యవహరించడం గమనించవచ్చు. ఇంతే గాక, శరీరమే ఆత్మ అని భ్రమించి, నేను యుద్ధం చేయను – అని యుద్ధం నుండి వెనుకకు తగ్గిన అర్జునునకు "శరీరం అచేతనం, ఆత్మ చేతనం. నశించే శరీరం కంటే నశించని ఆత్మ విభిన్నమైనది. యుద్ధంలో నీచేత చంపబడేది ఆత్మ కాదు. శరీరమే. నీ ఎదురుగా ఉండే వీరి శరీరాన్ని నీవు ఇప్పుడు వధించకపోయినా ఏనాటికైనా ఒక నాడు అది తప్పక నశిస్తుంది. దానిని గర్చి జ్ఞానులు కలత చెందరు. ఆత్మ ఈ శరీరాన్ని విడిచినట్లయితే వేరొక శరీరాన్ని పొంది తీరుతుంది. అందువల్ల మీ పాపుల శరీరాన్ని లేకుండా చేయడంకోసం అయినా నీవు యుద్ధం చేయడం అవసరం"అని ఈ విధంగా అతనికి చెప్పవలసిన తత్త్వవివేకం, ఆత్మనిత్యత్వ, శరీరానిత్యత్వాదులను మాత్రం ఒకటి రెండు శ్లోకాలతో తెలియజేస్తే సరిపోయి ఉండగా, ఆ విధంగా కాకుండా, యుద్ధంలో చాలా వివరంగా ఈ గీతాశాస్త్రాన్ని పూర్తిగా ఉపదేశించడం మహాచార్యత్వం వల్లనేకదా. భగవద్రామానుజులవలె పూర్ణమైన కరుణను కలిగి ఉండడం కదా మహాచార్యత్వానికి సూచకం. పండితులతో, పామరులతో తేడా లేకుండా కృష్ణ నామం కలిగినవారిని అందరిని కృష్ణమాచార్యులు అని వ్యవహరించడం శ్రీకృష్ణునకు కల ఆ మహాచార్యత్వాన్ని అనుసరించే కదా. "ఇమ్మాయమ్ వల్ల నహపిళ్ళై

నంబ"(పెరియాళ్వార్ తిరుమొழி–3–1–3) అనే విధంగా శ్రీ కృష్ణుడు బాల్యంతో నిండినవాడైనందున శ్రీకృష్ణుడు కూడా పిళ్ళై అనబడుతున్నాడు. అందువల్ల వసుదేవ పుత్రునకు కృష్ణుడు, మహాచార్యుడు, పిళ్ళై అని మూడు పేర్లు ఉన్నట్లు గమనించాము. "శ్రీమత్ కృష్ణేన సహ సమాః ఆహ్వాః యస్య సః"అనే విగ్రహం చెప్పి, కృష్ణునితో సమానమైన పైన తెలిపిన మూడు పేర్లను కలిగినవారు, ఈ ఆచార్యులు అనే అర్థాన్ని కూడా ఇక్కడ చెప్పవచ్చు. ఇక పెరియ వాచ్చాన్ పిళ్ళై ఈ మూడు నామాలను కలిగి ఉండడంలో ఉండే సామంజస్యాన్ని గమనిద్దాం.

ఈ మహాచార్యులు 'ఆవణి' మాసం రోహిణి నక్షత్రంలో కృష్ణునివలే అవతరించారు. అందువల్ల వీరికి వీరి తండ్రి యామునాచార్యులవారు కృష్ణుడనే అనే నామాన్ని పెట్టారు. కనుక వీరు కృష్ణుడు అయ్యారు. తనియన్ శ్లోకం కూడా "శ్రీమత్ కృష్ణ సమాహ్వాయ"అని దీనిని తెలుపుతున్నది. పలువిధాలైన గ్రంథాలను అనుగ్రహించి నందున లోకంలోని వారికి దైవసంపత్తును పెంచి అసుర సంపత్తును పోగొట్టి, భూమి భారాన్ని పోగొట్టి, సుఖాన్ని కలిగించినందున కూడా కృష్ణశబ్దంలోని అవయవార్థం వీరి విషయంలో సమన్వయించడం గమనించదగినది. ఆళ్వారులు అనుగ్రహించిన నాలాయిరానికి తేనె, పాలు, కలకండ, అమృతం వంటి వ్యాఖ్యానాలను రచించినందున, రామాయణ తనిశ్లోకం, భారతాది తనిశ్లోకం, ఋగ్వేద ఖిలమైన జితంతే స్తోత్రానికి వ్యాఖ్యానం, స్తోత్రరత్నం, చతుఃశ్లోకి, గద్యత్రయాలకు వ్యాఖ్యానాలను రచించినందున శ్రీకృష్ణునకు ఉండే మహాచార్యుడు అనే పేరు వీరికి చాలా తగినది. మహాచార్య శబ్దమే పెరియవాచ్చాన్ అని ద్రావిడనామంగా మారి వీరిని నిర్దేశించడం గమనించాలి. పిళ్ళై అనే పదానికి శ్రీకృష్ణుని విషయంలోవలె వీరి ఈ విషయంలో బాల్యం కారణంగా కాకుండా

లోకాచార్యులైన నంబిళ్ళై వీరిని జ్ఞానపుత్రులుగా అభిమానించి వీరిని "పిళ్ళాయ్"అని పిలిచినందున, వీరికి ఈనామం యుక్త మైనది.

ఇక, వీరికి తగిన, ప్రత్యేకమైన గొప్పతనాలను కొన్నింటిని గమనిద్దాం. "పిళ్ళాన్ నంజీయర్ పెరియ వాచ్చాన్ పిళ్ళై తెళ్ళార్ వడక్కు త్తిరువీదిప్పిళ్ళై మణవాళయోగి తిరువాయ్ మొழியై క్కాట్ర గుణవాళరెన్ఱు నెంజే! కూఱు"అని వరవరములు 'తిరువాయ్ మొழி' ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని రచించి రక్షించిన గొప్పతనాన్ని కలిగినవారుగా పూర్వాచార్యులను ఐదుగురిని నిర్దేశించారు. వీరు అందరూ చాలా గొప్పతనాన్ని కలిగినవారే అయినా, ఈ ఈ పిళ్ళైకు ఉండే ప్రత్యేకత సాటి మేటి లేనిది.

మణవాళ యోగి అనే అళకియ మణవాళచ్చీయర్, తమ ఆచార్యుల అజ్ఞతోగాని, అనుమతితో కానీ కాకుండా లోకులపై ఉండే ప్రీతితో మాత్రమే పన్నీరాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని 'తిరువాయ్ మొழி' ప్రబంధానికి రచించారు. వడక్కు త్తిరువీదిప్పిళ్ళై నంబిళ్ళై ఉపన్యాసాన్ని ఈడు ముప్పత్తాఱాయిరప్పడి వ్యాఖ్యగా రచించారు. తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్, నంజీయర్ అనే ఇద్దరు భగవద్రామానుజుల అనుగ్రహాన్ని, భట్టర్ అనుగ్రహాన్ని ప్రార్థించి పొంది, వారి అనుమతితో ఆఱాయిరప్పడి, ఒన్బదినాయిరప్పడి అనే వ్యాఖ్యానాలను 'తిరువాయ్ మొழி' ప్రబంధానికి రచించారు. ఇక పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తునాలాయిరప్పడి అనే వ్యాఖ్యను రచించిన వైనాన్ని గమనిద్దాం.

"నంబిళ్ళై తమ్ముడైయ నల్లరుళాల్ ఏవి యిడ ప్పిన్ పెరియవాచ్చాన్ పిళ్ళై యదనాల్ ఇన్బా వరుపత్తి మాఱన్ మఱైప్పొరుళై చ్చొన్నదు ఇరుపత్తు నాలాయిరమ్"అని శ్రీవరవరమునులు 'ఉపదేశ రత్నమాల' ప్రబంధంలో పలికిన

సూక్తిని కొంచెం వివరంగా చూద్దాం. నంబిళ్ళై తమ చల్లని కరుణతో 'తిరువాయ్ మొழி' ప్రబంధానికి ఒక చక్కని వ్యాఖ్యానాన్ని రచించండి అని నియమించగా, ఆచార్యుల ఆ ఆజ్ఞను శిరసా వహించి, నిరతిశయసుఖరూపమైన భక్తిని కలవారు, ఆప్తులు అయిన నమ్మాళ్వార్లు తమకు గల ఆ భక్తి ప్రభావం చేత అనుగ్రహించిన ద్రవిడవేదరూపమైన 'తిరువాయ్ మొழி' ప్రబంధంలోని అర్థాన్ని ఇరుపత్తు నాలాయిరప్పడి అనే వ్యాఖ్యానంగా రచించారు–అనేది ఈ పాశుర భావం.

ఇందులో "ఏవి యిడ పిన్ శొన్నదు"అని అన్నందున, ఆచార్యులు అజ్ఞాపించిన తరువాతే వ్యాఖ్యానం చేశారు – అనే విషయం, "అదనాల్ శొన్నదు"అని అన్నందున వ్యాఖ్యానించడానికి ఆచార్యుల ఆజ్ఞ కారణం అని తెలుస్తున్నది. "అదనాల్"అనే పదంవల్ల ఆచార్యుల ఆజ్ఞ లేకుండా స్వతంత్రంగా వ్యాఖ్యానాన్ని చేసిన నడువిల్ తిరువీదిప్పిళ్ళై భట్టర్, వడక్కు త్తిరువీదిప్పిళ్ళై వ్యావర్తింపబడ్డారు"– అనే పిళ్లైలోకంజీయర్ సూక్తి స్మరణీయం. దీనివల్ల తామే స్వయంగా వ్యాఖ్యానం రచించిన వాది కేసరి అళకియ మణవాళ జీయర్, వడక్కు త్తిరువీదిప్పిళ్ళై, ఆచార్యుల అనుమతిని ప్రార్థించి పొంది వ్యాఖ్యను రచించిన పిళ్ళాన్, నంజీయర్ అనే ఈ నలుగురిని కంటే ఏ స్వాతంత్ర్యగంధం లేకుండా, ఆచార్యపారతంత్ర్యాన్ని పూర్తిగా కలిగి ఉండడమనే వైలక్షణ్యం ప్రస్ఫుటం అవుతుంది.

నంబిళ్ళై తమకు ప్రియశిష్యులు, తమ దగ్గర అన్ని విషయాలను స్పష్టంగా అభ్యసించిన పెరియవాచ్చాన్ పిళ్ళైను "తిరువాయ్ మొழி ప్రబంధానికి ఒక వ్యాఖ్యానాన్ని రచించండి"అని ఆజ్ఞాపించగా, పెరియవాచ్చాన్ పిళ్ళై కూడా శ్రీ

రామాయణ శ్లోకసంఖ్యలో ఒక వ్యాఖ్యానాన్ని రచించారు – అని ఆఱాయిరప్పడి గురుపరంపరాప్రభావంలోని సూక్తిని కూడా స్మరించాలి.

ఈ విధంగా తిరువాయ్ మొழி ప్రబంధానికి మాత్రమే కాకుండా మిగిలిన ఆళ్వారుల ప్రబంధాల కూడా వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన గొప్పతనం వీరికి ఒక్కరికే ఉన్నది. ఈ విషయం "పెరియవాచ్చాన్ పిళ్ళై పిన్బుళ్ళవైక్కుమ్"అనే పాశురంలో ఈ విషయాన్ని శ్రీవరవరములు ఉపదేశరత్నమాల ప్రబంధంలో తెలిపారు. "నమ్మాళ్వారుల ప్రబంధమైన 'తిరువాయ్ మొழி'కే కాకుండా తిరుప్పల్లాండు నుండి తిరుమడల్ వరకు ఉండే 23 దివ్య ప్రబంధాలుకు వ్యాఖ్యానాలను రచించినందున అర్థం తెలుసుకోవడానికి కష్టంగా ఉండే ఈ ప్రబంధాల అర్థాన్ని, తరువాతి కాలంలోని ఆచార్యులకు చక్కగా తెలుసుకోవడానికి వీలు అవుతున్నది. ఇతరులకు ఉపదేశించడానికి కూడా వీలు అవుతున్నది"– అనేది ఈ పాశురంలోని భావం. "మిగిలిన ఆచార్యుల కంటే వీరికి గల గొప్పతనం ఇదే కదా"అనే పిళ్ళైలోకంజీయర్ సూక్తిని ఇక్కడ స్మరించాలి.

★★★★★

# శ్రీవిష్ణుపురాణప్రామాణ్యం

శ్రీ విష్ణుపురాణం పురాణాలు అన్నిటిలోనూ చాలా గొప్పది. ఇందులో ఉండే అర్థాన్ని తెలిసికోగలిగినా, తెలిసికోలేకపోయినా, దీనిని కేవలం పారాయణ చేస్తే చాలు, చాలా మంచి ఫలం కలుగుతుంది.ఈ పురాణంలో ఎన్నో ఉన్నతమైన తత్వాలు వివరింపబడ్డాయి. తత్వహిత పురుషార్థాల యథార్థ స్వరూపం ఇందులో వివరింపబడింది. దివ్యసూరులు అందరూ ఇందులోని సూక్తులలోని అర్థాలను తమ పాశురాలలో అనుసంధించారు. మన పూర్వాచార్యులు అందరు దీనిని పరమ ప్రమాణంగా గ్రహించి ఆదరించారు. భగవద్రామానుజులు కూడా శీభాష్యంలో పలుచోట్ల ఇందులోని ప్రమాణాలను ఉదాహరించి ఈ పురాణం విశిష్టాద్వైత తత్వాలను తెలియజేస్తున్నదని నిరూపించారు. స్తోత్రరత్నంలో శ్రీయామునాచార్యులవారు దీనిని పురాణరత్నంగా అభివర్ణించారు, ఈ పురాణాన్ని అనుగ్రహించిన పరాశర మహర్షికి ప్రణామాలను తెలిపారు.

"వేదేషు పౌరుషం సూక్తం పురాణేషు చ వైష్ణవమ్,
భారతే భగవద్గీతా ధర్మశాస్త్రేషు మానవమ్"

(వేదాలలో అన్నిటిలోనూ పురుష సూక్తం ప్రధానమైనది, పురాణాలలో శ్రీ విష్ణు పురాణం ప్రధానమైనది, భారతంలో భగవద్గీత ప్రధానమైనది, ధర్మశాస్త్రాలలో మనుధర్మశాస్త్రం ప్రధానమైనది) అనే ఈ సూక్తి శ్రీవిష్ణు పురాణగౌరవాన్ని తెలుపుతున్నది.

శ్రీ వైష్ణవసంప్రదాయంలో మూడు రత్నమనే విశేషణంతో కీర్తింపబడుతున్నాయి. మంత్ర రత్నమని ద్వయ మంత్రం, పురాణరత్నమని శ్రీ విష్ణుపురాణం, స్తోత్రరత్నమని శ్రీయామునుల స్తోత్రం వ్యవహరింపబడుతున్నాయి.

స్తోత్రరత్నంలో శ్రీయామునులు శ్రీ విష్ణుపురాణాన్ని పురాణరత్నమని కీర్తించడానికి మూలమైన పది విశేషణాలను వేదాంతదేశికులు తమ స్తోత్రభాష్యంలో తెలియజేశారు. ఆ పది విశేషణాలు ఈ విధంగా ఉన్నాయి. ఇవి అన్నీ, అటు ఏదోషం లేని రత్నానికి, ఇటు శ్రీ విష్ణుపురాణానికి కూడా అన్వయించే విధంగా ఉన్నాయి.

1)అత్రాసమ్– అంటే దోషం రత్నంలో ఉండే దోషం. శ్రీవిష్ణుపురాణంలో ఎటువంటి దోషం లేదు కనుక, అత్రాసం అనబడుతున్నది.

2) మానదమ్– రత్నం ఎవరి దగ్గర ఉంటుందో వారికి గొప్ప గౌరవం ఉంటుంది. ఆ విధంగానే, శ్రీ విష్ణుపురాణం తనను అధ్యయనం చేసేవారికి గౌరవాన్ని కలిగిస్తుంది. అంటే, శ్రీ విష్ణు పురాణాన్ని అధ్యయనం చేసినవారిని లోకంలో అందరూ గౌరవిస్తారు. అటువంటి గౌరవాన్ని శ్రీ విష్ణుపురాణం తనను అధ్యయనం చేసిన వారికి కలిగిస్తుంది. అందుచేత మానదం అనబడుతున్నది.

3) స్థైర్యం– రత్నం చిరకాలం నిలచి ఉండేటట్లే, శ్రీ విష్ణుపురాణం కూడా చిరకాల నిలచి ఉండేది –అని అర్థం.

4) భోగ్యం– రత్నం అనుభవించదగినది. ఆ విధంగానే శ్రీ విష్ణుపురాణం కూడా భగవంతుని స్వరూపరూప గుణ విభవ లీలలను వర్ణిస్తున్నందున పరమ భోగ్యంగా ఉంటుంది.

5) ప్రకాశకం– రత్నం ప్రకాశాన్ని కలిగి ఉంటుంది. ఆ విధంగానే శ్రీవిష్ణు పురాణం కూడా దానిని అధ్యయనం చేసినవానికి జ్ఞానవికాసాన్ని కలిగిస్తుంది.

6) మహార్ఘం– రత్నం గొప్ప విలువను కలిగి ఉండేటట్లు శ్రీ విష్ణుపురాణం కూడా అమూల్యమైనది. భగవంతునకు సంబంధించిన జ్ఞానం అమూల్యమైనది కదా.

7) మంగళమ్– రత్నం మంగళకరమైనది అయినట్లే, మంగళస్వరూపుడైన భగవంతుని తెలియజేసే శ్రీ విష్ణుపురాణం కూడా మంగళాత్మకమే.

8) మాన్యం –రత్నం గౌరవించదగినది అయినట్లే, శ్రీవిష్ణుపురాణం కూడా మిక్కిలి గౌరవించదగినది.

9) సురక్ష్యమ్– రత్నం చక్కగా రక్షించదగినది అయినట్లే, శ్రీవిష్ణు పురాణం కూడా చాలా జాగ్రత్తగా కాపాడుకొనదగినది పూర్వాచార్యులు దీనికి వ్యాఖ్యానాలను రచించి రక్షించి, ఇంకా అనేక ప్రయత్నాల ద్వారా మన వరకు అందేటట్లు చేశారు.

10) సుగ్రహం–రత్నం సులభంగా గ్రహించదగినది, అంటే, రత్నం ఎవరి చేతిలో ఉంటుందో, అది వారికి వారి ఇష్టం వచ్చినట్లు ఉపయోగించదగినదిగా ఉంటుంది. తాను ధరించవచ్చు, ఇతరులకు ఇవ్వవచ్చు, అమ్ముకోవచ్చు కూడా. ఆ విధంగానే, శ్రీవిష్ణు పురాణం కూడా తనను అధ్యయనం చేసినవానికి తనలో ఉండే అర్థం చక్కగా గురించేటట్లు అనుగ్రహించి, తగిన రీతిలో దానిని ఉపయోగించుకునే విధంగా ఉంటుంది..

ఈ విధంగా పది రీతులలో రత్నానికి, శ్రీ విష్ణు పురాణానికి సామ్యం ఉన్నది కనుక, ఈ పురాణం పురాణ రత్నమని అనదగినది– అని శ్రీదేశికుల అభిప్రాయం.

విద్యా స్థానాలు 14 అని చెప్పబడుతున్నాయి. అవి ఏవి? అంటే, “అంగాని వేదాః చత్వారః మీమాంసా న్యాయ విస్తరః, పురాణం ధర్మ శాస్త్రం చ విద్యా హ్యేతా చతుర్దశ”(వేదాలు నాలుగు, వాటి అంగాలు ఆరు, మీమాంస, న్యాయ శాస్త్రం,పురాణం,ధర్మశాస్త్రం అని ఈ విధంగా విద్యా స్థానాలు 14 అని చెప్పబడుతున్నాయి. అందుచేత ఈ 14 విద్యా స్థానాలలో పురాణాలు ఒక విద్యా

స్థానం. అందుచేత ఇవి తప్పక అధ్యయనం చేయదగినవి. ఇంతేకాదు, వేదాలలోని అర్థాన్ని ఈ పురాణాల సహాయంతో నిర్ణయించాలని కూడా చెప్పబడుతున్నది. అందుచేతనే వీటికి వేదోపబృంహణాలు అని పేరు. ఉపబృంహణాలు అంటే అర్థాన్ని వివరించేవి అని అర్థం. వేదాలు సులభంగా అర్థం చేసుకోవడానికి సాధ్యమైనవి కాదు అందుచేత వాటిలోని అర్థాన్ని మనం గ్రహించడం కోసమే మహా రుషులు పురాణాలను రచించి ఇచ్చారు.

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,
బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరేదితి"

వేదాలలోని అర్థాన్ని ఇతిహాసాలు, పురాణాలు అనే వీటి సహాయంతో వివరించాలి. ఆ విధంగా ఇతిహాసాలలో, పురాణాలలో జ్ఞానం లేకుండా వేదాలను వివరించేవానిని చూచి వేదం "ఇతడు నాలో ఉండే అర్థాన్ని సరిగా తెలుసుకోలేక, అనుచితంగా తగని రీతిలో అర్థాన్ని చెబుతాడేమో! నన్ను మోసగిస్తాడేమో!"అని భయపడుతుందట. భగవద్రామానుజులు శ్రీభాష్యంలో ఈ శ్లోకాన్ని ఉదాహరించి, "ఇతి శాస్త్రేణ అర్థస్య ఇతిహాసపురాణాభ్యామ్ ఉపబృంహణం కార్యమ్"– ఇతిహాస పురాణాల సహాయంతో శాస్త్రంలో ఉండే అర్థాన్ని వివరించాలి– అని అంటారు.

భగవద్రామానుజులు శ్రీ భాష్యంలో స్మృతి పురాణ ఘట్టంలో ఉపబృంహణ పదానికి చాలా అందమైన నిర్వచనాన్ని చెబుతారు. "ఉపబృంహణం నామ విదితసకలవేదశబ్దానాం ప్రయోగమహిమసాక్షాత్కృత వేదతత్వార్థానామ్ వాక్యైః స్వావగతవేదవాక్యార్థ వ్యక్తీకరణమ్"– వేదవాక్యాల అర్థాన్ని తెలిసికొన్నవారు, పరమాత్మ వైభవాన్ని స్తుతించే వేద తాత్పర్యాన్ని తెలిసికొన్నవారు,చేసే వేదవాక్య వ్యక్తీకరణమే ఉపబృంహణం.. ఇక్కడ వేదశబ్దానికి వేదాంతమని అర్థం. ఎందుకంటే, ధర్మశాస్త్రాలు వేదంలోని పూర్వభాగాన్ని ఉపబృంహణం చేయగా, వేదంలోని

ఉత్తరభాగాన్ని ఇతిహాస పురాణాలు వివరిస్తున్నాయి. వేదంలోని పూర్వకాండకు కర్మకాండ అని, ఉత్తరకాండకు బ్రహ్మకాండ అని పేరు.

ధర్మశాస్త్రాలలో కూడా బ్రహ్మ ప్రతిపాదనంచేయబడింది. అయితే, అక్కడ ఉద్దేశం ఏమంటే, ఏ కర్మల చేత బ్రహ్మ ఆరాధింపబడుతున్నదో ఆ బ్రహ్మ యొక్క స్వరూపాన్ని తెలియజేయడంవరకే అక్కడ ఉద్దేశం. ధర్మ శాస్త్రాలలో ప్రధానమైన ప్రమేయం కర్మల ఆచరణను తెలియజేయడమే. కానీ, ఉత్తరకాండలో ఈ బ్రహ్మస్వరూపం చాలా స్పష్టంగా వివరించబడుతుంది.

ఇతిహాసాలలో, పురాణాలలో కూడా ధర్మ ప్రతిపాదనం చేయబడుతుంది. కాని, అది అంతా బ్రహ్మోపాసనకు అంగంగానే చేయబడుతుంది. ఇతిహాస పురాణాల ప్రధానమైన ఉద్దేశ్యం వేదాంతాల విశదీకరణమే. ధర్మశాస్త్రాలు కేవలం వేదంలోని పూర్వభాగ విశదీకరణం కోసమే ప్రవర్తించాయి. ఈ విషయాన్ని అంతటినీ శ్రీసుదర్శన సూరి శ్రుతప్రకాశికా వ్యాఖ్యానంలో వివరించారు. మహర్షులు, పూర్వాచార్యులు మనకు అనుగ్రహించిన గ్రంథాలు అన్నీ అమూల్యమైనవి. అవి పరమ ప్రమాణాలు. ఆపస్తంబులు,"ధర్మజ్ఞసమయః ప్రమాణం, వేదాశ్చ"(ధర్మాలను తెలిసినవారి ఆచారం ప్రమాణమైనది, వేదాలు కూడా) అని అంటారు. ఈ వచనంలో ఆ మహర్షి ధర్మజ్ఞుల ఆచారానికి మొదటి స్థానాన్ని ఇచ్చారు. ధర్మాన్ని తెలిసిన పెద్దలు ఆచరించే ఆచారమే పరమ ప్రమాణం అన్నారు. గౌతమ మహర్షి కూడా "వేదోఖిలో ధర్మమూలం, తద్విదాం చ స్మృతిశీలే"అని అన్నారు.

శ్రీ విష్ణు పురాణప్రాధాన్యాన్ని, వైభవాన్ని, ప్రామాణ్యాన్ని మనం తప్పక తెలుసుకోవాలి. ఈ విషయాన్ని గూర్చి శ్రీసుదర్శన సూరి శ్రుతప్రకాశికా గ్రంథంలో చాలా వివరంగా అనుగ్రహించారు. వారు శ్రీవిష్ణు పురాణం పరమ ప్రమాణమని అంటారు. "ప్రసిద్ధ్యతిశయలబ్దసజాతీయప్రబంధ ప్రకర్షత్వాత్"అనేది అక్కడ వారి

సూక్తి. శ్రీ విష్ణు పురాణం సత్వమూలమైనది. అందుచేత ఇది సాత్విక పురాణం. సాత్విక పురాణాలు అన్ని యథార్థానికి అనుకూలమైనవిగా ఉంటాయి. చాలా పురాణాలు శివపారమ్యాన్ని చెబుతున్నప్పటికీ, అవన్నీ రాజసతామస పురాణాలుగానే లెక్కింపబడుతున్నాయి. భ్రాంతిమూలంగా ఎన్ని వేల, వందల వాక్యాలు చెప్పినప్పటికీ, అవి ప్రమాణాలు కాబోవు. బ్రాంతి లేకుండా యథార్థమైన జ్ఞానంతో ఒక్క మాట చెప్పినా, అదే ప్రమాణం అవుతుంది– అని శ్రుతప్రకాశికాచార్యుల వారు అంటారు.ఇక్కడ వారు చాలా ప్రమాణ వాక్యాలను ఉదాహరిస్తారు.

"అగ్నేః శివస్య మాహాత్మ్యం తామసేషు ప్రకీర్త్యతే,
రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణో విదుః,
సాత్వికేష్వర్థకల్పేషు మాహాత్మ్య మధికం హరేః"

(తామస పురాణాలలో అగ్ని, శివుల మహిమ ఎక్కువగా చెప్పబడుతుంది. రాజసపురాణాలలో బ్రహ్మ వైభవం తెలియజేయబడుతుంది. సాత్విక పురాణాలలో విష్ణుమహిమ తెలియజేయబడుతుంది)

దీనివల్ల విష్ణు పురాణం "యథార్థజ్ఞాననిష్పాదక సత్వమూలాన్యార్థజ్ఞాన విపరీత జ్ఞానహేతుభూత తమోమూలత్వాభావాత్"(యథార్థజ్ఞానాన్ని కలిగించే సత్త్వగుణాన్ని మూలంగా కలిగినందున, అన్యార్థజ్ఞానాన్ని, విపరీత జ్ఞానాన్ని కలిగించే తమోగుణమూలకం కానందున) ప్రమాణమైనది. అందువల్ల ఈ విష్ణు పురాణం తత్వాలను ఎటువంటి సంశయ విపర్యయాది దోషాలు లేకుండా ఉండే రీతిలో ప్రతిపాదిస్తుంది. ఇందులో అన్యార్థానికి కానీ, విపరీతార్థానికి కానీ తావు లేదు. దేహాత్మ భ్రాంతిని కానీ, అన్యశేషత్వభ్రాంతిని కానీ ఈ పురాణం కలిగించదు. అన్యార్థాలను, విపరీతార్థాలను కలిగించేది బుద్ధి తామస బుద్ధి –అని కదా గీతా,

ఆచార్యుడు అన్నాడు. ఈ విధంగా అన్యార్థాలను తెలియజేసే ఉపదేశాలు కానీ,విపరీతార్థాలను తెలియజేసే ఉపదేశాలు కానీ ఈ పురాణంలో ఎక్కడా మనకు కనిపించవు. శ్రీవిష్ణుపురాణం ప్రమాణం కావడానికి ఇది ఒక ప్రధానమైన కారణం.

శ్రీ విష్ణు పురాణప్రామాణ్యానికి ప్రసిద్ధి అనేది ఇంకొక కారణం. ఈ విష్ణుపురాణం చాలా ప్రసిద్ధి చెందిన పురాణం. శ్రీశంకరాచార్యులవారు ఈ పురాణంనుండి వందలాది శ్లోకాలను తమ బ్రహ్మసూత్ర భాష్యంలో ఉదాహరించారు.శ్రీవిష్ణుపురాణ శబ్దాన్ని ప్రయోగించకుండానే, "తదుక్తం పురాణే"అని వారు అంటారు. దీనివల్ల అన్ని పురాణాలలోనూ ఇది చాలా ప్రసిద్ధమైన పురాణమని తెలుస్తున్నది. భగవద్రామానుజులు కూడా శ్రీ భాష్యంలో స్మృతి పురాణ ఘట్టంలో శ్రీ విష్ణుపురాణ శ్లోకాలను ప్రమాణంగా ఉదాహరించారు.

శ్రీ విష్ణుపురాణప్రామాణ్యానికి శ్రీ సుదర్శనసూరి తెలిపిన ఇంకొక కారణం ఏమంటే, మిగిలిన పురాణాలలో కనిపించినట్లు ఈ పురాణంలో బాధక ప్రత్యయం ఏమి లేకపోవడం. ఈ పురాణంలో అంతట శ్రీమన్నారాయణుడే జగత్కారణతత్వంగా ప్రతిపాదింపబడ్డాడు. ఈ పురాణం ఆరంభంలో మైత్రేయ మహర్షి అడిగిన ప్రశ్న సామాన్యమైన ప్రశ్న. "ఎవని నుండి ఈ ప్రపంచం పుడుతున్నది? ఎవనిలో నిలచి ఉన్నది? ఎవనిలో లభిస్తున్నది?"అని పరాశరమహర్షిని అతడు అడిగాడు. దీనికి సమాధానంగా పరాశరమ మహర్షి శ్రీమన్నారాయణుడే జగన్మూలతత్వమని తెలియజేశారు. కానీ, లింగ పురాణం మొదలైన మిగిలిన పురాణాలలో ప్రశ్న ఉండే రీతి, దానికి సమాధానం చెప్పే రీతి, రెండు వేరే.. లింగపురాణంలో మొదట అడిగిన ప్రశ్నలోనే లింగ పదప్రయోగం చేయబడింది. దానికి అనుగుణంగానే సమాధానం కూడా చెప్పబడింది అందుచేత, ఇక్కడ ప్రశ్నలో కానీ, సమాధానంలో కానీ ఏ విధమైన విశేషం, వైలక్షణ్యం లేదు. కానీ, ఎక్కడ ప్రశ్న

సామాన్యంగా అడగబడిందో, దానికి సమాధానం ఎక్కడ విశేష దేవతా పర్యవసానంగా చెప్పబడిందో, అక్కడ అతిశయం గోచరిస్తుంది కదా. ఈ ప్రకారాన్ని విష్ణు పురాణంలో ఆరంభంలోనే గమనించవచ్చు. వేదంలో పలుచోట్ల సామాన్య శబ్దాల ద్వారా, విశేష శబ్దాల ద్వారా శ్రీమన్నారాయణుడే జగత్కారణ తత్త్వమని తెలియజేయబడింది. దేవతాంతరాలు ఎవరు జగత్కారణ తత్త్వం కాదని కూడా అవి తెలియజేశాయి. దీనివల్ల బ్రహ్మ కాని, శివుడు కానీ జగత్కారణ తత్త్వమని తెలియజేసే మిగిలిన పురాణాలు అన్నీ వేదార్థానికి విరుద్ధమైనవి అని ఏర్పడుతున్నది కదా. అంతే కాదు లింగపురాణంలో కూడా నారాయణ కారణత్వం స్పష్టంగా చెప్పబడిందని శ్రీ సుదర్శనసూరి సూచిస్తారు ఈ నారాయణ పరత్వం మనుధర్మశాస్త్రం మొదలైన పలు ధర్మశాస్త్రాలలో ఘోషింపబడుతున్నది. ఇది అంతా శ్రీవిష్ణుపురాణప్రామాణ్యాన్ని తెలియజేస్తున్నది.

శ్రీ సుదర్శన సూరి తెలిపిన ఇంకొక హేతువు ఏమంటే, వక్తృవైలక్షణ్యం. ఈ పురాణ ప్రవక్త పరాశరమహర్షి. "పరాన్ ఆశృణాతి ఇతి పరాశరః"– ఇతరులను, కాదనడానికి వీలులేని హేతువులతో, న్యాయాలతో ఓడించి హింసించేవాడు– అని ఈ పేరులోని అర్థం. వేదం కూడా పరాశరమహర్షి వైభవాన్ని పొగడింది.లింగపురాణం కూడా ఈ మహర్షి మహిమను కొనియాడింది.

ఈ పరాశర మహర్షి "పులస్త్య వశిష్ట వరదానలబ్ధవరదేవతాపారమార్థ్యజ్ఞానం"(పులస్యమహర్షి వశిష్ట మహర్షి అనుగ్రహించిన వరాల కారణంగా పరదేవతకు సంబంధించిన యథార్థమైన జ్ఞానం) కలవాడు. తాను ఈ విధంగా ప్రార్థజ్ఞానాన్ని పొందిన వృద్ధాంతాన్ని పరాశర మహర్షి స్వయంగా శ్రీవిష్ణుపురాణంలో తెలియజేశాడు. లింగ పురాణంలో కూడా

పరాశరమహర్షి దేవతాపారమార్థ్యజ్ఞానాన్ని కలవాడని చెప్పబడింది ఈ పురాణానికి కల వైలక్షణ్యాలలో ఇది కూడా ఒకటి.

శ్రీ విష్ణుపురాణంలో వేదార్థాలు అన్ని తెలియజేయబడ్డాయి.మ ఈ పురాణం సర్వ వేదార్థసంయుతమని కీర్తింపబడింది అందుచేతనే ఇది సకల పురుషార్థాలను పొందడానికి ఆవశ్యకమైన జ్ఞానాన్ని ఇవ్వగలిగినది. ఈ విధంగా విష్ణుపురాణానికి కల ప్రబంధ వైలక్షణ్యం, వక్తృవైలక్షణ్యం వ్యక్తమవుతున్నాయి. విష్ణుపారమ్యం మిగిలిన పురాణాలలో ప్రతిపాదింపబడడం కూడా ఇక్కడ గమనించాలి.

శ్రీ సుదర్శనసూరి శ్రుతప్రకాశికవ్యాఖ్యలో ఒక ప్రాకృత శ్లోకాన్ని ఉదాహరించారు. ఒకడు తన భార్యను విడచి పెట్టి, వేరొక స్త్రీతో సంబంధాన్ని పెట్టుకుంటాడు. కొంతకాలం తర్వాత అతడు శ్రీవిష్ణుపురాణాన్ని విని, తన తప్పును తెలుసుకొని, పరివర్తనను పొందుతాడు.,"నేను శ్రీవిష్ణుపురాణాన్ని విన్నాను. నా తప్పును గ్రహించాను. ఇక నేను ఏ తప్పును చేయను. నేను ప్రాయశ్చితాన్ని చేసుకుని నా పత్ని దగ్గరకు పోతాను"అని అతడు అంటాడు. దీనినిబట్టి శ్రీ విష్ణు పురాణానికి గల ప్రసిద్ధి, మానవులకు పరివర్తనం కలుగజేయడంలో దానికి గల శక్తి వ్యక్తం అవుతున్నది.

అన్యపురాణాలలో అక్కడక్కడ పరస్పర వృద్ధమైన వాక్యాలు ఉన్నట్లుగా శ్రీ విష్ణు పురాణంలో కనిపించవు. ఇది కేవలం భగవంతుడైన శ్రీ విష్ణువుయొక్క పరత్వాన్ని తెలియజేయడంలోనే దృష్టి కలిగినది.

"పురాణం పంచ లక్షణమ్ "అని చెప్పబడుతున్నది. పురాణంలో ఉండే ఆ ఐదు విషయాలు ఏమిటంటే,

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ,

**వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్"**

(సృష్టి,ప్రళయం, పలు వంశాలు, మన్వంతరాలు, వంశాను చరితం అనే ఐదు విధాలయిన విషయాలను వర్ణించేదే పురాణం). ఈ ఐదు లక్షణాలు శ్రీవిష్ణుపురాణంలో చక్కగా అన్వయిస్తాయి.

శ్రీరామాయణం శ్రీరాముని కథను తెలుపుతున్నది. అయితే, శ్రీరామాయణ రచనలోని ఉద్దేశం కేవలం శ్రీరామచంద్రుని వృత్తాంతాన్ని తెలుపడంలోనే ఉన్నదా? లేక, అంతకు మించి మరి ఏదైనా ఉద్దేశం ఉన్నదా ?అని ఆలోచిస్తే, శ్రీరామాయణంలోని "వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః"(వేదోపబృంహణంకోసం ఆ కుశలవులను వాల్మీకి తన శిష్యులుగా స్వీకరించాడు) అనే సూక్తి మనకు సమాధానం తెలుపుతున్నది. ఈ వచనం వల్ల వేదార్థాలను ఉపబృంహణం చేయడం కోసం శ్రీరామాయణం రచింపబడింది– అని తెలుస్తున్నది. ఈ విధంగానే, శ్రీ విష్ణు పురాణం కూడా కేవలం ఆయా వంశాల చరిత్రను వర్ణించడం కోసం రచింపబడలేదు. వేదార్థవిశదీకరణం కోసమే రచింపబడింది. శ్రీభాష్యంలోని స్మృతి పురాణఘట్టంలో భగవద్రామానుజులు "పులస్త్య వశిష్ట వరప్రదానలబ్దదేవతాపారమార్థ్యజ్ఞానవతో భగవతః పరాశరాత్ స్వావగతవేదార్థోపబృంహణమిచ్చన్ మైత్రేయః పరిపప్రచ్ఛ"(పులస్యుడు మహర్షి, వశిష్ట మహర్షి అనుగ్రహించిన వరాల చేత యథాతథంగా దేవతాపారమార్థ్యజ్ఞానం కలిగిన పరాశరమహర్షి వల్ల తాను తెలుసుకొన్న వేదార్థాల విశదీకరణను పొందగోరిన మైత్రేయుడు పరాశరమహర్షిని ప్రశ్నించాడు) అని అనడం కూడా ఇక్కడ గమనించాలి. ఇందువల్ల శ్రీ విష్ణుపురాణం వేదంలోని అర్థాలను ఉపబృంహణం చేస్తున్నదని స్పష్టమవుతున్నది.

ఈ పురాణాన్ని పరాశరమహర్షి చెప్పాడు. ఈ పురాణం పవిత్రమైన ఒక గంగాజలం వంటిదని. ఇందులో మనం అవగాహిస్తే, మనం పవిత్రతను పొందుతామని వేదాంతదేశికులు అంటారు. దేవలోకంలో ఉండే గంగానదిని భూమి పైకి భగీరథుడు తీసుకుని వచ్చినట్లే, పరాశర మహర్షి కూడా వేదార్థాలనే పవిత్రమైన గంగను విష్ణు పురాణరూపంలో వెలువరించి, మనకు అందించాడు.

శ్రీ విష్ణుపురాణం తత్వహితపురుషార్థాలను చక్కగా వివరిస్తున్నదని శ్రీయామునులు స్తోత్రరత్నంలో ఈ విధంగా అంటారు

“తత్త్వేన యః చిదచిదీశ్వర తత్స్వభావ– భోగాపవర్గ తదుపాయగతీ రుదారః,
సందర్శయన్ నిరమమీత పురాణరత్నం తస్మై నమో మునివరాయ పరాశరాయ”

(చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే ఈ మూడు తత్త్వాలు, ఈ లోకంలోని పురుషార్థాలు, మోక్షపురుషార్థం, వాటి ఉపాయాలు– అనే ఈ విషయాలను అన్నిటినీ తెలియజేస్తూ పరాశర మహర్షి పురాణరత్నం అనబడే శ్రీవిష్ణుపురాణాన్ని రచించారు. అటువంటి మహర్షికి నమస్కారం). ఈ లోకంలో ఉండే పూర్వార్థంలో శ్రీవిష్ణుపురాణంలోని విషయ సంగ్రహం సూచింపబడింది.

వేదానికి– శిక్ష,వ్యాకరణం, ఛందస్సు, విరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు అంగాలు ఉన్నాయి. ఆ విధంగానే, శ్రీవిష్ణుపురాణానికి ఆరు అంశాలు అనే విభాగాలు ఉన్నాయి. ఈ ఆరు అంశాలలో ఆరు వేదాంగాలలోని విషయాలు సూచింపబడ్డాయి– అని పెద్దలు అంటారు.

శ్రీ విష్ణుపురాణంలోని ఎన్నో సూక్తులకులోని అర్థాలను, తత్త్వాలను ఆళ్వార్లు తమ దివ్యప్రబంధాలలోని పాశురాలలో అనువదించారు. ఈ వివరాన్ని అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు ఆయా పాశురాలను వ్యాఖ్యానించే సందర్భంగా వివరించి తెలియజేశారు.

తిరువాయ్ మొழி ప్రబంధంలోని ఎనిమిదవ దశకంలోని పదవ పాశురంలో నమ్మాళ్వార్లు భగవంతుని "మాయామూర్తియాయ్"అని సంబోధించారు. ఇక్కడ ఈ పదంలోని "మాయా"శబ్దం సంస్కృతంలోని "మాయా"అనే శబ్దం కాదు.ఇది ద్రావిడ శబ్దం. దీనికి "నశించని, ఏకరూపమైన"అని అర్థం. అందువల్ల "మాయా మూర్తి "అని అంటే "ఏనాడు నశించని, ఏకరూపమైన రూపాన్ని కలవాడ"ని అర్థం. శ్రీ విష్ణు పురాణంలో భగవంతుని రూపం "సదైక రూపరూపాయ"అని చెప్పబడింది.దీనికి కూడా "ఎల్లప్పుడూ ఒకే విధమైన, ఏనాడు మార్పు చెందని రూపాన్ని కలవాడు"అని అర్థం. ఈ అర్థమే పైన ప్రస్తావింపబడిన ఆళ్వారుల "మాయామూర్తి "అనే ప్రయోగంవల్ల తెలుస్తున్నది. ఈ విషయాన్ని పెరియవాచ్చాన్ పిళ్ళై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో పై విష్ణుపురాణ సూక్తిని ఉదాహరిస్తూ వివరించడంవల్ల గమనించవచ్చు.

ఈ ప్రబంధంలోనే పదవ శతకంలోని పదవ దశకంలో ఉండే ఎనిమిదవ పాశురంలో ఆళ్వారులు వరాహావతారానికి ఎత్తిన భగవంతుని రూపాన్ని కీర్తిస్తూ "నీలవరై ఇరండు పిఱై కవ్వి"అని అంటూ ఆ రూపం రెండు చంద్ర వంకలను ఇరువైపులా కలిగిన నల్లని పర్వతంవలె ఉన్నదని అన్నారు. ఈ సూక్తి శ్రీవిష్ణు పురాణంలోని "తతః సముత్ క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః పుటపద్మలోచనః రసాతలాదుత్పలపత్రసన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్"(వికసించిన పద్మాల వంటి నేత్రాలను గల మహావరాహమూర్తి అప్పుడు భూమిన రసాతలంనుండి తన కోర దంతంతో ఎత్తినవాడై, నల్ల కలువల రేకుల వర్ణాన్ని కలవాడై, పైకి వచ్చిన గొప్ప నల్లని పర్వతం వలె ప్రకాశించాడు) అనే సూక్తిని తలపిస్తున్నది. ఈ విషయాన్ని పెరియా వాచ్చాన్ పిళ్లై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలోను, అళకియ మణవాళ చ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానంలోనూ

ఈ శ్లోకాన్ని ఉదాహరించి పైన ప్రస్తావించిన ఆళ్వారుల సూక్తిని వివరించారు. ఇటువంటి ఉదాహరణలు చాలా ఉన్నాయి.

శ్రీ విష్ణ పురాణంలో 6000 శ్లోకాలు ఉన్నాయి. ఈ శ్లోకసంఖ్యలోనే తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ అనే ఆచార్యులు భగవద్రామానుజుల అజ్ఞానుసారం నమ్మాళ్వారుల తిరువాయ్ మొழிకి ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని రచించారు.

శ్రీ విష్ణుపురాణానికి ఎంగళాழ்వాన్ అని సంప్రదాయంలో ప్రసిద్ధులైన శ్రీ విష్ణుచిత్తులవారు అనుగ్రహించిన శ్రీవిష్ణుచిత్తీయం అనే వ్యాఖ్యానం ఉన్నది. శ్రీ విష్ణు చిత్తులు భగవద్రామానుజులకు శిష్యులు,. నడాదూర్ అమ్మాళ్ అనబడే శ్రీవాత్స్యవరదగురువులకు కాలక్షేపాచార్యులు. నడాదూర్ అమ్మాళే శ్రీ భాష్యానికి శ్రుతప్రకాశిక అనే సాటి లేని వ్యాఖ్యానానికి రచించిన సుదర్శన సూరికి ఆచార్యులు. ఈ విష్ణుచిత్తీయ వ్యాఖ్యానం సుమారు 100 సంవత్సరాలకు ముందు తెలుగులిపిలో, దేవనాగరిలిపిలో ముద్రింపబడింది.

★★★★★

# సంచయేచ్ఛ- సంచితేచ్ఛ

కురుక్షేత్ర యుద్ధ ప్రారంభానికి ముందు అర్జునుడు అస్థానస్నేహ కారుణ్యం చేత తగని విషాదాన్ని పొందాడు. తన దగ్గర బంధువులను, ఆత్మీయులను రెండు పక్షాల సైన్యంలోనూ చూస్తున్నాను. వీరిని వధించడానికి నాకు మనసు రావడం లేదు. అందువల్ల, నేను యుద్ధం చేయలేను"అని అంటూ గాండీవాన్ని కింద పడవేశాడు. అతని మనసులో కలిగిన సందేహాలను, భయాలను అన్నిటినీ శ్రీకృష్ణ భగవానుడు తీరుస్తూ, గీతోపదేశం చేశాడు. ఆ ఉపదేశాన్ని విన్నఅర్జునుని మనసులో ఉండే సందేహాలు అన్ని తీరిపోగా, యుద్ధమనే తన కర్తవ్యాన్ని అతడు నిర్వహించాడు.

కురుక్షేత్ర యుద్ధం ముగిసింది. రెండు పక్షాలలోనూ తీరని నష్టం కలిగింది. దీనిని గమనించిన ధర్మపుత్రునకు అంతు లేని విచారం, నిరుత్సాహం కలిగాయి. . అతని మనసులో ఎన్నో సందేహాలు. "యుద్ధం చేయడం తప్పు, ఆ యుద్ధంలో బంధుమిత్రులను వధించడం తప్పు. నేను చేసిన ఈ తగని పనిని స్మరిస్తూ రాజ్యపాలన చేయలేను ,అరణ్యాలకు వెళ్లిపోతాను"అని తన సహోదరులతో, భార్య ద్రౌపదితో పలికి, వనాలకు వెళ్లి పోవడానికి సిద్ధపడ్డాడు. "ఈ యుద్ధం వల్ల ఏమి సిద్ధించింది ధృతరాష్ట్రుడు ఆశించినది సిద్ధించలేదు. దుర్యోధనుడు మరణించాడు. నేను అనుకున్నది జరగలేదు. రాజ్యాన్ని రెండు భాగాలు చేసుకుని మేము ,కౌరవులం, సుఖంగా పాలించవచ్చు -అని ఆశపడ్డాను. అది జరుగలేదు. అంతా నష్టమే జరిగింది. ఈ రాజ్యం నాకు వద్దు. రాజ్యపాలన వద్దు. ఈ సింహాసనం వద్దు. రాజ్య భోగాలను అనుభవిస్తూ పరిపాలన చేయలేను. నేను వనవాసానికి వెళ్ళిపోతాను"అని అంటూ అరణ్యాలకు బయలుదేరాడు.

అప్పుడు, అర్జునుడు అతనిని చూసి అన్నా!ఇటువంటి సందేహాలు అన్నీ నా మనసులో ఇంతకు ముందు యుద్ధ ప్రారంభంలో కలిగాయి. నీకు యుద్ధం పూర్తి అయిన తర్వాత కలిగాయి. అంతే తేడా", అని అంటూ శ్రీకృష్ణుడు తనకు చేసిన ఉపదేశ సారాన్ని ధర్మరాజుకు తెలియజేసి అతని మనసును శాంతపరచడానికి ప్రయత్నం చేశాడు.

"ఈ రాజ్యపాలనలో నాకు ఆశ లేదు– అని నీవు అనడానికి వీలు లేదు. నీవు యుద్ధం చేసి, ఈ రాజ్యాన్ని సంపాదించావు. దీనిని పాలించకుండా వదిలిపెట్టి వెళ్ళిపోవడం నీకు తగిన ధర్మం కాదు. 'నాకు సంపదలో ఆశ లేదు, రాజ్య పరిపాలనలో ఉద్దేశం లేదు, సుఖభోగాలలో ఆసక్తి లేదు' అని అంటూ ఈ విధంగా నీవు అనడం ధర్మం కాదు. నీవు క్షత్రియుడవు. రాజ్యాన్ని పాలించడం గాని, రాచభోగాలను అనుభవించడం గాని నీకు తప్పు కాదు."అని అంటూ అర్జునుడు, భీమసేనుడు ,మిగిలిన సహోదరులు ఇద్దరు, ద్రౌపది కూడా ధర్మరాజుకు చెప్పారు. ఆ విధంగా వారు ధర్మరాజుతో చెప్పేటప్పుడు "సంపదను సంపాదించడంలో కానీ, సంపాదించిన సంపదలో కానీ మన మనసు చిక్కుకోకూడదు"అని అన్నారు.

ఈ రెండు చాలా ముఖ్యమైన విషయాలు. సంపాదనను సంపాదించే క్రమంలో చాలా ఋజువుగా ,న్యాయబద్ధంగా ప్రవర్తించాలి. సంపాదించే క్రమంలో పేరాశ ఎంత మాత్రం తగదు. తనకంటే ఎక్కువ సంపదను సంపాదించినవారిని చూచి అసూయపడడం కూడా తగదు. అక్రమంగా ప్రయత్నించి, అధికంగా సంపాదించి కూడబెట్టాలి – అనే ప్రయత్నాన్ని చేయకూడదు. ఇదే "ధనసంచయంలో అత్యాశ తగదు"అనేదానికి తాత్పర్యం.

ఆ విధంగానే, సంపాదించిన సంపదలో మనసు అధికంగా ఆసక్తం కావడం కూడా తగినది కాదు. "ఈ సొత్తు నాది, నాది, అని అనుకోవడం, ఈ సంపద నా

అనుభవం కోసం, నా ఆనందం కోసం— అని భావించడం, ఆ విధంగా సంపాదించిన సంపదలో తగని బంధాన్ని పెంచుకొని, దానిని సంరక్షించుకోవడం కోసం అక్రమమైన మార్గాలను అనుసరించడం వంటి ప్రయత్నాలను చేసినట్లయితే, సంచిత ధనంలో మనం చిక్కుకున్నవారమే కాగలము. ఇది ఎంత మాత్రం తగినది కాదు.

అందువల్ల సంపదను కూడగట్టడంలో పేరాశను కలిగి, ఆ విధంగా సంపాదించిన సంపదను అనుభవించడంలో, సంరక్షించడంలో అధికమైన సంగాన్ని కలిగి చిక్కుకోకూడదు— అని అన్నారు, అర్జునుడు.

ఆ విధంగా ఉండడం సాధ్యం అవుతుందా? అనే ధర్మపుత్రుని సందేహాన్ని తీర్చడం కోసం నిదర్శనంగా పలువురు మహానుభావులైన రాజుల పేర్లను ఉదాహరించాడు. మాంధాత, నహుషుడు, అంబరీషుడు, యయాతి, జనకుడు, అశ్వపతి మొదలైన గొప్ప గొప్ప రాజులు ఇటువంటివారు. వీరందరూ రాజర్షులు అని కీర్తింపబడేవారు. కొంచెం కూడా సంపద విషయంలో సంగాన్ని లేనివారు. అయితే, వీరెవ్వరూ కూడా తమ రాజ్యాన్ని విడచి వెళ్లిపోలేదు. రాజ్యాన్ని పాలిగించడం అనే తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించారు. ఆ విధంగా పాలించే క్రమంలో వారికి ప్రాప్తించిన సంపదను ఎటువంటి తగని సంగాన్ని లేనివారై అనుభవించారు. అందువల్ల “అన్నా! ధర్మపుత్రా! నీవు భావించినట్లుగా రాజ్యాన్ని వదిలిపెట్టి అరణ్యాలకు వెళ్లడం నీకు తగదు. రాజ్యంలోనే ఉండి, దానిని పరిపాలించడమే నీకు కర్తవ్యం. అదే మనకు విధింపబడిన కర్మ. ధర్మంకూడా. ఈ విధంగా చేయకపోతే, ప్రజలు మనలను గౌరవించరు. జగదీశ్వరుడైన భగవానుడు కూడా అంగీకరించడు. అందువల్ల రాజ్యంలోనే ఉండి, నీకు కర్తవ్యం అయిన రాజ్యపాలనను చేయడమే

సరి"అని అర్జునునితో పాటు మిగిలిన సహోదరులు అందరూ ధర్మపుత్రునకు చెప్పారు.

ఈ క్రమం మన జీవితానికి కూడా అన్వయిస్తుంది. ఈ లోకంలో మనం జన్మించిన తరువాత ఇక్కడ మన జీవితాన్ని సాగించి తీరాలి. అయితే, ఆ జీవన క్రమంలో సంపదను సంపాదించడంలో అధికమైన ఆశను కలిగి ఉండడం కానీ, మనకు ప్రాప్తించిన సంపదను అనుభవించడంలో దానిపై తగని అహంకార మమకారాన్ని పెంచుకోవడం కానీ సరి కాదు. లేక, ఈ జీవితం నుండి, ఈ లోకంనుండి తొలగిపోవాలని ప్రయత్నించడం కూడా సరి కాదు. ఇదే పై భారత వృత్తాంతంనుండి మనం గమనించవలసిన, సారమైన విషయం. స్వస్తి.

★★★★★

# తులసి అంటే ఏమి?

(శ్రీ వేలుక్కుడి కృష్ణన్ స్వామి En pani-3010 కి అనువాదం)

కోవెలకు వెళ్లినప్పుడు, మనం భగవంతుని ప్రసాదంగా తులసిని పొందుతాం. “తణ్ణమ్ తుழாయ్, తిరుత్తుழாయ్”అని తులసి ఆళ్వారుల దివ్యప్రబంధాలలో చాలా గొప్పగా కీర్తింపబడింది. అయితే, ఈ తులసి అనే పదానికి అర్థం ఏమి? కొంచెం గమనిద్దాం.

పలు కోణాలలో ఈ పదానికి అర్థం చెప్పబడింది. తుల్యం, తోలనం, తులనం అనే పదాలు రెండు వస్తువులను త్రాసులోని తట్టలో పెట్టి, వాటిని తూచడం అనే అర్థాన్ని ఇస్తాయి. రెండు వస్తువులను ఒకదానితో ఇంకొకటి సమానంగా ఉన్నాయా?”అని పరీక్షించి చూడడం ఈ పదాల ద్వారా తెలియజేయబడుతుంది.

తులసి అనే పదంలోని “తుల”అనే పదానికి “సమమైనది, తుల్యమైనది”అని అర్థం. “స్యతి”అంటే– లేకుండా చేస్తున్నది– అని అర్థం. అందువల్ల తులసి అనే పదానికి “తనతో సమానమైనది ఏదీ లేకుండా చేస్తున్నది– అని అర్థం వస్తుంది. అంటే, తనతో సాటి వచ్చేది ఏది లేనిది కనుక, తులసి అని చెప్పబడుతున్నది– అని అర్థం.

గమనించి చూసినట్లయితే, భగవదారాధనలో తులసికి మించిన వస్తువు ఇంకొకటి లేదు. ఇది మొదటి అర్థం.

ఇక, రెండవ అర్థం ఏమంటే– “తులం, స్యతి– ప్రాప్నోతి”– భగవంతుని వక్షస్సును అలంకరించి, ఆ స్వామితో సమమై, ఆ స్వామితో సమానమైన స్వభావాన్ని

పొందుతున్నది– అని అర్థం. భగవానుని వక్షస్సులో ఉండి, అతనితో సాదృశ్యాన్ని పొందుతున్నందున తులసి అనబడుతున్నది– అని అర్థం.

ఇక, మూడవ అర్థం. "త"అనే అక్షరానికి మరణం– అని అర్థం. దానితో ఉకారం చేరినప్పుడు, తు అనే అక్షరమై, అది మరణంతో కూడినది– అనే అర్థాన్ని ఇస్తుంది. "లసి–లసతి"– ప్రకాశిస్తున్నది– అని అర్థం. తేజస్సుతో కూడినది –అని తాత్పర్యం. అందువల్ల "తులసి "అనే పదానికి –మరణంతో కూడినది అయినా, అంటే, వాడిపోయినది అయినప్పటికీ, ప్రకాశాన్ని కలిగి ఉండేది –అని అర్థం. తులసి వాడిపోయినప్పటికీ దాని విలువ ఏమాత్రం తగ్గదు. కొన్ని దినాల వరకు అది భగవంతుని ఆరాధనకు ఉపయోగపడుతుంది అని శాస్త్రం చెబుతున్నది. ఈ విధంగా పెద్దల అనుష్ఠానం కూడా ఉన్నది. ఇటువంటి గొప్పతనం మరి ఆరాధన ద్రవ్యానికి లేదు కదా.

తులసిని కొన్ని దినాలలో చెట్టు నుండి కోయకూడదు –అని శాస్త్రం చెబుతున్నది. అమావాస్యలో, ద్వాదశిలో శుక్రవారంలో, ఆదివారంలో, శ్రాద్ధ దినాలు మొదలైన దినాలలో తులసిని కోయకూడదు అని విధి. అటువంటి దినాలలో తులసిని కోయకపోయినప్పటికీ భగవదారాధనన చేయాలి కదా. అందుకోసం ముందు దినంలోనే తులసిని కోసి పెట్టుకోవలసి ఉంటుంది. ముందు దినంలో కోసిన మిగిలిన పువ్వులు ఆరాధనకు పనికి రాకపోయినాప్పటికీ, ముందు దినంలో కోసిన తులసి మాత్రం భగవంతుని పూజకు ఉపయోగించడంలో ఏ విధమైన నిషేధం లేదు. ఇది తులసికి కల ప్రత్యేకత. కోసిన తులసిని ఒక సంవత్సర కాలం పాటు ఆరాధనకు ఉపయోగించవచ్చు అని పెద్దలు అంటారు. అందువల్ల చాలా దినాలకు ముందు కోయబడినప్పటికీ, వాడిపోయినప్పటికీ, తులసికి కల విలువ

ఏమాత్రం తగ్గదు. అది భగవదారాధనకు ఉపయోగించదగినదై ప్రకాశిస్తుంది. అందువల్ల తులసి అనబడుతున్నది –అనేది మూడవ అర్థం.

ఈ విధంగా, తనతో సాటి వచ్చేది ఇంకొకటి లేనిది– అని మొదటి అర్థం కాగా, భగవానునితో సాటి వచ్చే సామ్యాన్ని పొందుతున్నది– అనేది రెండవ అర్థం, ఎండిపోయినప్పటికీ వాడిపోయినప్పటికీ విలువ ఏమాత్రం తగ్గకుండా భగవంతుని ఆరాధనకు అర్హమై ప్రకాశిస్తున్నది– అనేది మూడవ అర్థం.

తులసికి కల గొప్పతనం ఎంతటిది అంటే, ఒకవేళ తలసీదళాలు లభించకపోయినప్పటికీ, ఆ తులసి కొమ్మలు , కాండం అయినా, వేరు అయినా , చివరకు అది కూడా లభించకపోయినా, తులసి మన్ను అయినా ఆరాధనకు పనికి వస్తుంది. ఇవి ఏవి లభించకపోయినప్పటికీ, తులసి అనే పదాన్ని ఉచ్ఛరిస్తూ ఆరాధిస్తే, ఆ పదమే భగవంతునకు ప్రీతికరం అవుతుంది. ఇది తులసికి కల గొప్పతనం. తులసి అనే పదానికి కల గొప్పతనం.

దీనిని బట్టి తులసికి గల గొప్పతనం ఎంతటిదో తెలుస్తున్నదికదా. అందువల్ల కనీసం ఒక్క తులసీదళాన్ని అయినా సంపాదించి, దానితో భగవంతుని అర్చించి, ఆ స్వామికి ఆనందాన్ని కలిగిద్దాం. స్వస్తి.

★★★★★

# వేదాన్ని ద్రావిడీకరించిన ఆళ్వారులు

# ద్రావిడవేదభాష్యకారులు

(కీర్తిమూర్తులు ఉవే శ్రీమాన్ ఎస్ కృష్ణ స్వామి అయ్యంగార్ స్వామి వారు)

అనాదికాలంగా మన భారతదేశంలో వేదాన్ని ప్రమాణంగా గ్రహించి వెలిగే మతం వైదిక మతం అని చెప్పబడుతున్నది. లోకంలోనే చాలా ప్రాచీనమైన గ్రంథాలైన ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం అనే నాలుగు వేదాలను ఆధారంగా కలిగినది, ఈ మతం. అనంతర కాలంలో ఈ వేదాలకు అర్థాన్ని చెప్పడంలో పలువురు మతాచార్యులలో భిన్నాభిప్రాయాలు ఏర్పడడంచేత వేదాంతాలను ఆధారంగా చేసుకుని అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం అని మూడుగాను, ఆరాధించే దైవాలను ఆధారంగా చేసుకుని శైవం, వైష్ణవం అనే రెండుగాను ఈ మతం చీలిపోయింది. అయినప్పటికీ, ద్రావిడ వేదం అయిన తమిళంలో సంస్కృత వేదం అయిన సంస్కృతంలో సుమారుగా రెండు వేలకు పైబడిన సంఖ్యలో ఉండే గ్రంథాలను పరిశీలించి చూసినప్పుడు, ఆ కాలంలో విశిష్టాద్వైత వైష్ణవమే వైదిక మతంగా చాలామంది చేత గ్రహింపబడింది అనే విషయం మధ్యస్థులుగా ఉండే వారికి పక్షపాతం లేకుండా విషయాలను గ్రహించినవారికి తప్పక అర్థం అవుతుంది.

వేదార్థాలను వివరించడంకోసం వచ్చిన సంస్కృత గ్రంథాలు – స్మృతులు అని, ఇతిహాసాలు అని, పురాణాలు అని మూడు విధాలుగా ఉంటాయి. స్మృతులలో చాలా ప్రాచీనమైనది మనుస్మృతి. ఇది ముఖ్యమైనది కూడా. శ్రీరామాయణం, మహాభారతం అనేవి రెండు ఇతిహాసాలు. ఇవి కూడా 2000 సంవత్సరాలకు

ముందు ఆవిర్భవించాయి – అని పరిశోధకులు కూడా అంగీకరించారు. పురాణాలలో, శ్రీ విష్ణుపురాణం చాలా ప్రాచీనమైనది. సుమారు 2000 సంవత్సరాలు కాలం నుండి అనేక మతాలవారిచే ప్రమాణంగా అంగీకరింపబడి ఉదాహరింపబడుతున్నది. మనుస్మృతి ఆరంభంలో నారాయణుడు అనే పరమ పురుషుడే లోకాలను అన్నిటిని సృష్టించాడు– అని చెప్పబడింది. అతడు తన శరీరం నుండి సంకల్ప మాత్రంతోనే ఈ లోకాలను సృష్టించాడు – అని అందులో చెప్పబడింది. వీటినిబట్టి మనుస్మృతి త్రిదండి వేదాంతుల సిద్ధాంతమయిన విశిష్టాద్వైత వైష్ణవాన్నే ఆదరించినని తెలుస్తున్నది– అని మనుస్మృతికి అవతారికలో ఉల్లూకభట్టు నిష్పక్షపాతమైన తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. శ్రీరామాయణం, మహాభారతం అనే రెండు ఇతిహాసాలు శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని వేలాది సందర్భాలలో ఘోషించాయి అనే వాస్తవం అందరూ తెలిసినదే. రావణ వధ జరిగిన తరువాత బ్రహ్మ మొదలైన దేవతలు అందరూ శ్రీరాముని స్తుతించేటప్పుడు "భవాన్ నారాయణో దేవః శ్రీమాన్ చక్రాయధో విభుః"అని చక్రాన్ని ధరించిన నారాయణుడే శ్రీరాముడు –అని, త్రయాణాం త్వం హి లోకానాం ఆదిః కర్తా", అని లోకాలకు అతడే ఆది కర్త అని, "జగత్ సర్వం శరీరం తే "అని, లోకం అంతా అతనికి శరీరం అని పలకడాన్ని బట్టి, శ్రీరామాయణంలో వాల్మీకి మహర్షి చేత విశిష్టాద్వైత శ్రీవైష్ణవ మతమే అంగీకరింపబడినది – అని స్పష్టమవుతుంది. నారాయణ కథ అని ఆరంభింపబడిన మహాభారతంలో కూడా కృష్ణుడైన నారాయణుడే పరమాత్మ అని, అతడు లోకాలను శరీరంగా కలిగినవాడు – అని అనేక సందర్భాలలో ఘోషింపబడింది. పురాణరత్నం అని పొగడబడిన శ్రీవిష్ణు పురాణంలో కూడా విష్ణువే లోకాలను అన్నిటినీ సృష్టించి రక్షించి లయం చేసే పరతత్త్వం అని ఆరంభంనుండి చివరివరకు అన్నిచోట్ల చెప్పబడింది. "తత్సర్వం

వై హరే తనుః", "తాని సర్వాణి తద్వపుః "అని లోకాలన్నీ విష్ణువు యొక్క శరీరంగానే చెప్పబడినది. వీటిని బట్టి పురాణరత్నమైన శ్రీవిష్ణు పురాణం కూడా విశిష్టాద్వైత శ్రీవైష్ణవ మతాన్ని వ్యక్తం చేసింది –అని స్పష్టమవుతున్నది. సంస్కృత శాస్త్రాలైన శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాలనుండి వందల సంఖ్యలోని ప్రమాణాలను ఉదాహరించి విష్ణుచిత్త విజయంలో ఈ విషయాన్ని మేము చక్కగా సుస్థాపించాము.

ద్రావిడ భాషలోని గ్రంథాలలో కూడా, సంఘకాలంలో ఆవిర్భవించిన తొల్కాప్పియం మొదలైన లక్షణ శాస్త్రాలు, పత్తు పాటు ఎట్టుతోగై అనే సంకలన గ్రంథాలు 2000 సంవత్సరాలకు ముందు పుట్టినవి అని పరిశోధకులు అందరూ అంగీకరిస్తున్నారు. వీటిలో ఎట్టుత్తొగై అనే గ్రంథంలో, దైవాలను గురించి ఎక్కువగా ప్రస్తావించిన పరిపాడల్ గ్రంథంలో, లక్ష్మీనాథుడే అన్ని లోకాలను సృష్టించి రక్షించి లయం చేస్తున్నాడు– అని, అతడే మోక్షాన్ని ఇచ్చే దైవం –అని, వేదాంతాలలో పరతత్త్వానికి తగిన అన్ని విధాలైన స్వభావాలను కలవాడుగా చెప్పబడినవాడని పలుచోట్ల ఘోషింపబడింది. లక్ష్మీనాథుడే అన్ని లోకాలను శరీరంగా కలిగినవాడని, అన్నిటికీ అంతర్యామిగా ఉన్నందుచేత అన్ని వస్తువులుగా చెప్పబడుతున్నాడని పుఱనానూఱు అనే గ్రంథం తెలుపుతున్నది. వీటినిబట్టి, ద్రావిడ దేశంలో కూడా సంఘకాలంలో విశిష్టాద్వైత వైష్ణవమే వైదిక మతంగా గ్రహింపబడింది, అంగీకరింపబడింది– అని తెలుస్తున్నది.

ఇంతకుముందు ప్రస్తావించిన స్మృతీతిహాస పురాణాలలోనూ సంఘ కాలంలోని గ్రంథాలలోనూ జగత్తు మిథ్య అనే అద్వైతంలోని సిద్ధాంతంగాని, వేరొక దైవాన్ని పరతత్త్వంగా చెప్పే వాక్యాలు గాని ఎక్కడా కనిపించకపోవడం వల్ల, రెండు వేల సంవత్సరాలకు ముందువరకు అద్వైత వేదాంతం కాని, శైవం కాని, ఇంకా

మిగిలిన అన్యమతాలు కానీ, ప్రాచీనుల చేత అంగీకరింపబడినవి కావు– అని కూడా స్పష్టపడుతున్నది.

క్రీస్తుశకం ఏడవ శతాబ్దం తరువాత నాయన్మార్లు జన్మించి, శివుడే పరతత్వం అనే శైవమతాన్ని ప్రచారం చేయడం ఆరంభించారు. క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దంలో ఆదిశంకరులు జన్మించి, లోకం అంతా మిథ్య అని, జీవుడు, బ్రహ్మం ఒకటే అని చెప్పే అద్వైతమతాన్ని లోకంలో ఎక్కువగా ప్రచారం చేశారు. చారిత్రకల అభిప్రాయాన్నిబట్టి క్రీస్తు శకం అయిదవ శతాబ్దంనుండి. ఆవిర్భవించినవారుగా భావింపబడే దివ్యసూరుల కాలంలోనే శైవ మతం ప్రచారాన్ని పొందడం ఆరంభించినందున, సంగ కాలీన కవుల మార్గాన్ని అనుసరిస్తూ వచ్చిన ఆళ్వార్లు ఆ మతాన్ని నిరసించి తమ దివ్యప్రబంధాలలో శ్రీమన్నారాయణుడే పరతత్వంగాను, సర్వాంతర్యామిగాను తెలిపే విశిష్టాద్వైత శ్రీవైష్ణవ మతమే వైదిక మతం అని స్థాపించారు.

ఈ వాస్తవాన్ని స్పష్టంగా తెలియజేయడం కోసం, పరమాత్మకే చెందిన గొప్పతనాలను ఎనిమిది శీర్షికలలో ప్రస్తావించి, వేదాలు, ఆళ్వారులు ఆ గొప్పతనాలను శ్రీమన్నారాయణునకే ఉన్నట్లుగా చెప్పిన సంగతిని ఇక తెలియజేయడం జరుగుతుంది.

౧) నారాయణుడే లోకాన్ని అంతటిని సృష్టించి రక్షించి లయం చేసే జగత్కారణుడు

“నారాయణాత్ బ్రహ్మ జాయతే, నారాయణాత్ రుద్రో జాయతే, నారాయణాత్ ఇంద్రో జాయతే, నారాయణాత్ ద్వాదశాదిత్యాః రుద్రా వసవః”(నారాయణోపనిషత్)

నారాయణునివల్ల బ్రహ్మ పుట్టాడు, బ్రహ్మకు అంతర్యామి అయిన నారాయణుని నుండి రుద్రుడు పుట్టాడు, రుద్రునకు అంతర్యామి అయిన

నారాయణుని నుండి ఇంద్రుడు పుట్టాడు. ఈ విధంగా నారాయణుని నుండి 12 మంది ఆదిత్యులు 11 మంది రుద్రులు, 8 మంది వసువులు జన్మించారు.

"ఏకో హ వై నారాయణ ఆసీత్, న బ్రహ్మా, నేశానః"(మహోపనిషత్)

ప్రళయ కాలంలో నారాయణుడు ఒక్కడే ఉన్నాడు. బ్రహ్మా లేడు, శివుడు లేడు.

ఈ అర్థాన్ని తెలియజేసే దివ్యప్రబంధాలలోని సూక్తులు కొన్ని

"నాన్ ముగనై నారాయణన్ పడైత్తాన్, నాన్ముగనుమ్ తాన్ముగమాయ్ శంకరనై త్తాన్ పడైత్తాన్"(నాన్ముగన్ తిరువందాది–1)

(నారాయణుడు చతుర్ముఖుని సృష్టించాడు. ఆ చతుర్ముఖునకు అంతర్యామిగా నిలచి ఉండి శంకరుని సృష్టించాడు)

"పోదు తంగు నాన్ముగన్ అవన్మగన్ శొలిల్
మాదు తంగు కూఱన్ ఏఱతూర్ తి ఎన్ను వేదనూల్ ఓదుగిన్ఱదుణ్మై యల్లదిల్లైయే."
(తిరుచ్చంద విరుత్తమ్– 72)

(కమలాసనుడైన బ్రహ్మ భగవంతునకు పుత్రుడై ఉన్నాడు. ఇంకనూ చెప్పవలసి వస్తే, కాంతను తన శరీరంలో సగభాగంలో కలిగిన వృషభవాహనుడు ఆ బ్రహ్మకు కుమారుడు– అని వేదం అనే శాస్త్రం చెప్పే విషయం వాస్తవం. ఈ విధంగా కాక, ఇంకొక అర్థాన్ని, అంటే, శివుని పరత్వాన్ని చెబితే, అది వాస్తవం కాదు).

"కళ్వా! ఎమ్మైయు ఏழுలకుమ్ ని
న్నుళ్ళే తోற்றియ ఇఱైవ! ఎన్ఱు,
వెళ్లేఱన్ నాన్ముగన్ ఇందిరన్ వానవర్
పుళ్ళూర్ దు కழల్ పణిందు ఏற்றுవరే",

(తిరువాయ్ మొழி– 2 – 2 –10)

(తెల్లని రంగును కలిగిన వృషభాన్ని వాహనంగా కల శివుడు, చతుర్ముఖుడు, ఇంద్రుడు మిగిలిన దేవతలు కలసి, "ఓ మాయావీ! మమ్ములను, ఏడు లోకాలను నీ సంకల్ప మాత్రంతో సృష్టించిన స్వామీ!"అని గరుడ వాహనుని శ్రీ చరణాలకు మొక్కి స్తుతిస్తారు. )

౨) నారాయణుడే లోకంలో అంతటిలో వ్యాపించి అంతర్యామిగా ఉన్నవాడై, అందువల్ల, అన్ని వస్తువులుగా చెప్పబడదగినవాడై ఉన్నాడు.

"నారాయణ పరం బ్రహ్మ తత్వం నారాయణః పరః
నారాయణ పరో జ్యోతి రాత్మా నారాయణః పరః
యచ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతేపి వా
అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః"

(తైత్తిరీయమ్ – నారాయణవల్లి)

నారాయణుడే పరబ్రహ్మ, నారాయణుడే పరతత్వం, నారాయణుడే పరంజ్యోతి, నారాయణుడే పరమాత్మ. ఈ లోకంలో కనిపించేవి, వినిపించేవి అయిన ఏ వస్తువులు అయినప్పటికీ, వాటి లోపల, వాటికి బయట అంతటా వ్యాపించి ప్రకాశించేవాడు నారాయణుడే.

"బ్రహ్మే నారాయణః శివశ్చ నారాయణః –––– నారాయణ ఏవేదం సర్వమ్"

(నారాయణోపనిషత్)

బ్రహ్మ నారాయణుడే, శివుడు నారాయణుడే, ––––– నారాయణుడే ఈ లోకం అంతా.

ఈ విషయాన్ని నిరూపించే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని

"ఆక్కై యుళ్ళుమ్ ఆవి యుళ్ళుమ్ అల్ల పుఱత్తినుళ్ళుమ్ నీక్క మిన్ఱి ఎంగుమ్ నిన్ఱాయ్"

(తిరువాయ్ మొళి– 4–7 – 6)

"నీరాయ్ నిలనాయ్ తీయాయ్ కాలాయ్ నెడువానాయ్
శీరార్ శుడర్కళ్ ఇరండాయ్ శివనాయ్ ఆయనానాయ్"

(తిరువాయ్ మొళి– 6 –9 –1)

(జలమై, భూమియై, అగ్నియై, వాయువై, విశాలమైన ఆకాశమై, గొప్పవి అయిన చంద్ర సూర్యులు అనెడి రెండు జ్యోతిస్సుల స్వరూపియై, శివునకు అంతర్యామియై, బ్రహ్మకు అంతర్యామియై)

3) నారాయణుడే అన్నిటినీ తెలిసిన సర్వజ్ఞుడుగాను, అన్నిటిని చేయగలిగిన సర్వశక్తిగాను ఉన్నాడు.

"అథ పురుషో హ వై నారాయణో ఽ కామయత ప్రజాః సృజేయేతి, నారాయణాత్ ప్రాణో జాయతే, మనః సర్వేంద్రియాణి చ, ఖం వాయుః జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ"(నారాయణోపనిషత్)

(పురుషుడు అనబడే నారాయణుడు"అన్ని వస్తువులను సృష్టిస్తాను"అని సంకల్పించాడు. నారాయణని నుండే ప్రాణం పుట్టింది. మనసు, అన్ని ఇంద్రియాలు, ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, అన్నిటిని ధరించే భూమి పుట్టాయి)

"య స్సర్వజ్ఞః సర్వవిత్ యస్యయ జ్ఞానమయం తపః"(ముండకోపనిషత్ –1–1–10)

(ఏ పరమాత్మ అన్నిటిని తెలుసుకుంటున్నాడో, అన్నిటినీ పొందుతున్నాడో అతని జగత్ సృష్టి అనే తపస్సు సంకల్పమయమై ఉన్నది),

"పరా ఽ స్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా
చ"(శ్వేతాశ్వతరోపనిషత్ –6–7)

(ఈ పరమాత్మ యొక్క శక్తి, జ్ఞానం, బలం, కార్యం గొప్పవి, పలువిధాలయినవి, సహజమైనవిగా ఉన్నాయి)

ఈ అర్థాన్ని అనువదించే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని–

“ఎల్లైయిల్ ఞానత్తన్ ఞాన మవదే కొండు ఎల్లా క్కరుమంగళుమ్ శెయ్ ఎల్లై యిల్ మాయన్”(తిరువాయ్ మొழி– 3– 10– 8)

(అంతు లేని జ్ఞానాన్ని కలవాడు, ఆ జ్ఞానాన్ని సాధనంగా చేసుకొని, అన్ని కార్యాలను అన్ని కాలాలలోను సృష్టించేవాడు, అంతు లేని ఆశ్చర్యాన్ని కలిగించే లీలలను చేసేవాడు)

౪) నారాయణుడే చాలా గొప్పదైన మోక్షాన్ని అనుగ్రహించి, సంసారం నుండి విముక్తిని అనుగ్రహిస్తాడు.

“ఉతామృతత్వేస్యేశానః––– హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ–– ఇష్టం మనిషాణ”(పురుష సూక్తం)

(మోక్షాన్ని అనుగ్రహించగలిగిన ప్రభువు పురుషుడు అనే పేరు గల నారాయణుడే. –––లక్ష్మీదేవి, భూదేవి ఆ పరమ పురుషుడవైన నీకు పత్నులు. ––– నీ దగ్గర నుండి మేము కోరినది అంతా పొందుతాము),

“తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః”

(ఋగ్వేదం–మండలం–1–5–2 –5)

(విష్ణువు యొక్క, గొప్పదైన ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడూ దర్శిస్తూ ఉంటారు)

ఈ అర్థాన్ని అనుసంధించే ద్రావిడ వేదప్రమాణాలు కొన్ని–

“వీడు ముదలామ్”(తిరువాయ్ మొழி– 2–8– 1)

(మోక్షాన్ని అనుగ్రహించేవాడు కూడా అతడే)

"శాయ్ కొండ ఇమ్మైయుమ్. శాదిత్తు వానవర్ నాట్టైయుమ్ నీ కండుకొళ్ ఎన్ఱు వీడు తరుమ్ నిన్ఱం నిన్ఱే"(తిరువాయ్ మొழி- 3- 9- 9)

(ఈ లోకంలో చక్కని అర్చావతారానుభూతిని ప్రసాదించి, "వైకుంతానుభవాన్ని కూడా నీవు పొందు"అని మోక్ష సుఖాన్ని స్థిరంగా అనుగ్రహిస్తాడు)

"ఇవ్వుడల్ నీంగి పోయ్ శెన్ఱు శెన్టాకిలుమ్ కండు శన్మమ్ కழிప్పాన్ ఎణ్ణి ఒన్ఱి ఒన్ఱి ఉలగమ్ పడైత్తాన్"

(తిరువాయ్ మొழி-3-9-10)

(జీవుని వశపరచుకునే ఈ శరీరం కూడా విడిచి పోయి, ఈ విధంగా, అనేక జనన మరణాలు గడచిన తరువాత, ఎప్పుడో ఒక సమయంలో తనను చూసి జన్మలను లేకుండా చేసుకోవాలని తలచి, సోమరితనం లేకుండా మాటిది మాటికి ప్రయత్నం చేస్తూ లోకాలను సృష్టించే భగవంతుని)

౫) నారాయణుడే అన్ని కళ్యాణ గుణాలకు ఆకరమై ఉండేవాడై, హేయ గుణాలు ఏవీ లేనివాడై ఉన్నాడు.

"నిష్కలంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధో దేవ ఏకో నారాయణః, న ద్వితీయో ஽ స్తి కశ్చిత్"(నారాయణోపనిషత్)

స్వరూప గుణాలలో ఏ విధమైన దోషం లేనివాడై, ప్రాకృతమైన గుణాలు ఏవీ లేనివాడై, శుద్ధుడై ఉండే దేవుడు నారాయణుడు ఒక్కడే, రెండవవాడు ఎవడు లేడు)

"ధాతా విధాతా కర్తా వికర్తా దివ్యో దేవ ఏకో నారాయణః, -- ఉద్భవః సంభవో దివ్యో దేవ ఎకో నారాయణః"(సుబాలోపనిషత్)

(అన్నిటినీ ధరించేవాడు, అన్నిటినీ విధించేవాడు, చేసేవాడు, గొప్ప వికారాలను కలిగినవాడు, పరమపదంలో ఉండే దేవుడైన నారాయణుడు ఒక్కడే. పలు విధాలైన అవతారాలను ఎత్తేవాడు పరమపదంలో ఉండే నారాయణుడు ఒక్కడే)

ఈ అర్థాన్ని తెలియజేసే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని-

"ఈఱిల వణ్ పుగ**ழ்** నారణన్"(తిరువాయ్ మొ**ழி**-1-2-10)

(అంతులేని కళ్యాణ గుణాలను కలిగిన నారాయణుడు)

"ఉయర్వఱ ఉయర్నలమ్ ఉడైయవన్"(తిరువాయ్ మొ**ழி**-1-1-1)

(తమతో సాటి, మేటి లేని, గొప్పవి అయిన ఆనందాది కళ్యాణ గుణాలను కలిగినవాడు)

"వల్వినైయేనై ఈర్ కిన్ఱ గుణాంగళై యుడైయాయ్!"(తిరువాయ్ మొ**ழி**-8-1-8)

(పాపిష్ఠివాడను అయిన నన్ను చీలుస్తున్న కళ్యాణ గుణాలను కలవాడా!)

"తో**ற்ற**క్కేడవై ఇల్లవన్"(తిరువాయ్ మొ**ழி** 3-6-6)

(జనన మరణాలు లేనివాడు)

ఽ) నారాయణుడే దేవతలకందరకు మొదటివాడైన దేవాధిదేవుడు

"అగ్ని రవమో దేవానాం విష్ణుః పరమః"(యజుస్సంహిత- 55)

(దేవతలలో అగ్ని చివరివాడు, విష్ణువు తనకు పైన ఇంకొక గొప్ప దేవత ఎవరు లేని స్థితిలో ఉండేవాడు),

"తం దేవానాం పరమం చ దైవతమ్"(శ్వేతాశ్వతరోపనిషత్)

వేదాన్ని ద్రావిడీకరించిన ఆళ్వారులు – ద్రావిడవేదభాష్యకారులు

(దేవతలలో గొప్ప దేవత అయి ఉండేవాడు ఆ పరమాత్మయే)

ఈ అర్థాన్ని అనుసందించే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని

"మనిశర్ క్కు ద్దేవర్ పోల దేవర్ క్కుమ్ దేవా! వో!"(తిరువాయ్ మొழி– 8 –1– 3)

(మానవులకు దేవతలవలె, దేవతలకు కూడా దేవుడవైన ఓ స్వామీ!)

"దేవాదిదేవనై"(తిరుప్పావై–8) (దేవాధిదేవుని)

౭) నారాయణుడే ఎవరికీ పరిచ్ఛేదించడానికి సాధ్యం కానివాడు

"న సంధృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్"

(తైత్తిరీయం నారాయణం–1–10)

(ఆ పరమాత్మ యొక్క రూపం ఎవని కన్నులకు కనిపించదు. ఎవడు అతనిని కంటితో చూడలేదు),

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"

(తైత్తిరీయం –ఆనందవల్లి –9)

(ఏ పరమాత్మ నుండి మనస్సుతో పాటు వాక్కులు కూడా అతనిని తెలియలేక వెనుకకు తిరుగుతున్నాయో)

ఈ అర్థాన్ని అనువదించే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని

"ఇలనదు ఉడైయనదు ఎన నినైవరియవన్"(తిరువాయ్ మొழி–1–1–3)

(ఆ వస్తువును తనకు లేనివాడని, ఈ వస్తువును తనకు కలవాడని భావించడానికి సాధ్యం కానివాడు)

"యాను మేత్తి ఏழுలకుమ్ ముற்று మేత్తి ప్పిన్నైయుమ్ తాను మేత్తిలుమ్ ఎంగెయ్ దుమ్"(తిరువాయ్ మొழி–4–3–10)

(భగవంతుని అనుగ్రహం చేత జ్ఞానాన్ని పొందిన నేను స్తుతించినా, అన్ని లోకాలు ఒకటై స్తుతించినా, ఆ పిమ్మట ఆ సర్వజ్ఞుడైన ఆ భగవంతుడు కూడా స్తుతించినా, తనను స్తుతించడానికి ముగింపు ఎప్పటికి?)

౮) నారాయణుడే సమస్త జీవులకు అన్ని విధాలైన బంధువై ఉండేవాడు

"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృత్ గతిః నారాయణః"(సుబాలోపనిషత్)

(తల్లి, తండ్రి, సహోదరుడు మొదలైన అన్ని విధాలైన బంధువుగాను, శరణంగాను, ఉపాయంగాను, స్నేహితుడుగాను, ప్రాప్యంగాను ఉండేవాడు నారాయణుడే)

ఈ అర్థాన్ని అనుసంధించే ద్రావిడవేదప్రమాణాలు కొన్ని

"పెఱ్ఱ తాయ్ నీయే పిఱప్పిత్త తందై నీ
మఱ్ఱై యారావారుమ్ నీ పేశిల్"(పెరియ తిరువందాది-5)

(నన్ను కన్న తల్లివి నీవే, జన్మకు కారణమైన తండ్రివి కూడా నీవే, ఇంకా చెప్పవలసి వస్తే, మిగిలిన బంధువులు కూడా నీవే)

"తందై తాయొడు తానుమాయ్ అవై యల్లనాయ్"(తిరువాయ్ మొழி– 3– 6 –9)
(తండ్రి తల్లితో పాటు, సకల విధ బంధువై)

౯) నారాయణయుడే వేదాలలో ఆదిదేవుడుగా ఘోషింపబడుతున్నాడు

"ద్వే విద్యే వేదితవ్యే –– పరా చైవాపరా చ,
తత్రాపరా ఋుగ్వేదో యజుర్వేదః సామవేదః అధర్వణవేదః"(ముండకోపనిషత్–1–1–4–5)

(పరమాత్మను తెలిపే రెండు విద్యలను జీవుడు తెలుసుకోవాలి. భక్తి అనేది గొప్పదైన విద్య. వేదాలు రెండవ విద్య. ఆ వేదాలు, ఋుగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం – అని నాలుగు విధాలుగా ఉన్నాయి)

ఈ అర్థాన్ని అనుసంధించే ద్రావిడవేద ప్రమాణాలు కొన్ని

"మఱైయాయ నాల్వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే!"(తిరువాయ్ మొழி –3–1–10),

(రహస్యమైన అర్థాలను కలిగిన నాలుగు వేదాల అంతరార్థంగా ప్రకాశించే వికసించే తేజఃస్వరూపా)

"నమ్ముడై నాయకనే! నాన్మఱైయిన్ పొరుళే"(పెరియాழ்వార్ తిరుమొழி–1–5–3),

(మాకు స్వామీ! నాలుగు వేదాలకు అర్థమయినవాడా!)

"వేదాంత విழுప్పొరుళిన్ మేలిరుంద విళక్కు"(పెరియాழ்వార్ తిరుమొழி–4–3–11),

(వేదాంతాలలోని గొప్ప అర్థాలలో ప్రకాశించే దీపంవంటివాడు)

"అరన్ నారాయణన్ నామమ్ ఉఱై నాన్మఱై"(ముదల్ తిరువందాది–5),

(ఒక దైవానికి హరుడని పేరు, వేరొక దైవానికి నారాయణుడని పేరు. ఒక దైవానికి వాహనం జ్ఞాన హీనమైన ఎద్దు, ఇంకొక దైవానికి వేద వేదస్వరూపుడైన గరుడడుడు వాహనం. దీనికి ప్రమాణం వేదం)

"పోదిల్మంగై పూదల క్కిழத్తి దేవి––– ఎన్ఱు వేదనూల్ ఓదుగిన్ఱదు ఉణ్మై యల్లదిల్లై"(తిరుచ్చంద విరుత్తమ్– 72)

(కమలాసనుడైన బ్రహ్మ భగవంతునకు పుత్రుడై ఉన్నాడు. ఇంకనూ చెప్పవలసి వస్తే, కాంతను తన శరీరంలో సగభాగంలో కలిగిన వృషభవాహనుడు ఆ బ్రహ్మకు కుమారుడు– అని వేదం అనే శాస్త్రం చెప్పే విషయం వాస్తవం. ఈ విధంగా కాక, ఇంకొక అర్థాన్ని, అంటే, శివుని పరత్వాన్ని చెబితే, అది వాస్తవం కాదు).

ఈ విధంగా ఇంతవరకు వేద వేదాంతాలు, దివ్య సూరుల దివ్యప్రబంధాలు మొదలైన వాటిలోనుండి ఉదాహరింపబడిన ప్రమాణాలను బట్టి రెండువేల సంవత్సరాలకు ముందునుండి సంఘకాలంవరకు ద్రావిడ దేశంలో "వేదంలో చెప్పబడిన మతం ఏది? "అనే విషయంలో ఏ విధమైన భ్రాంతి లేదు – అని, విశిష్టాద్వైత వైష్ణవమతమే వైదిక మతంగా గ్రహింపబడింది – అని స్పష్టమవుతున్నది. మహా కాలానికి తరువాత బౌద్ధ మతం, జైన మతం, కాపాలి మతం మొదలైన అవైదికమతాలు పుట్టి వ్యాపించడం ఆరంభించాయి. ఆ పిమ్మట అళ్వార్లు అవతరించి, మళ్లీ వైదిక మతాన్ని తల ఎత్తడం కోసం ద్రావిడ వేదం అనబడే దివ్య ప్రబంధాలను అనుగ్రహించారు. 2000 సంవత్సరాలకు ముందు ఏ విధమైన సంస్కృత ద్రావిడ గ్రంథాలలోనూ శ్రీమన్నారాయణుని కంటే వేరొక దైవాలు ఏవీ ఇటువంటి గొప్పతనం కలిగినవిగా చెప్పబడలేదు. దేవతాంతరాలు అన్నీ నారాయణుని చేత సృష్టింపబడి, రక్షింపబడి, లయం చేయబడేవారు అనే అర్థమే ఈ గ్రంథాలలో ఘోషింపబడింది. నారాయణుడు అనే ఈ పరతత్వానికి న్యూనతను పలికే –నారాయణుడు తన కన్నులను పెకలించి శివుని అర్చించిన కథ, దశావతారాలను భంగపరిచినట్లుగా చెప్పే కథ మొదలైనవి ఆ లక్ష్మీనాథునకు తక్కువదనాన్ని చెప్పడానికి ప్రయత్నించడంకోసం అనంతర కాలంలో కల్పింపబడిన కథలు మాత్రమే. ఇవి ఏవి ముందు తెలిపిన చాలా ప్రాచీనమైన సంస్కృత ద్రావిడ గ్రంథాలలో కనిపించడం లేదు. కాళిదాసు మొదలైన శివ భక్తులైన కవులు కూడా ఆ కథలను తమ కావ్యాలలో పరిగ్రహించి ఆదరించకపోవడాన్ని బట్టి ఇవి తర్వాతి కాలంలో కల్పింపబడిన కథలే అనేది స్పష్టం అవుతున్నది.

సంఘకాల సాహిత్యంలో చాలా ప్రాచీనగ్రంథమైన తొల్కాప్పియంలో "నూలే కరకమ్ ముక్కోల్ మణైయే ఆయుమ్ కాలై అందణర్ క్కు్రియా"అని

సన్న్యాసులకు లక్షణం చెప్పబడింది. దీనిని బట్టి సన్యాసులకు త్రిదండం, యజ్ఞోపవీతం అనేవి తప్పకుండా ఉండాలి అని సంగకాలంలో భావింపబడింది అని తెలుస్తుంది. కలిత్తొకై మొదలైన మిగిలిన సగ కాలానికి చెందిన గ్రంథాలలో కూడా త్రిదండాన్ని ధరించిన భాగవత సన్యాసులను గూర్చిన పలు ప్రస్తావనలు ఉండడాన్ని బట్టి, వారు ఆ కాలంలో చాలా గొప్పగా గౌరవింపబడ్డారు అని తెలుస్తుంది యజ్ఞోపవీతాన్ని విడచి పెట్టిన అద్వైత సన్యాసులను గూర్చి గాని, లేక, ఈ చిహ్నాలు ఏమీ లేకుండా ఉండే శైవ సన్యాసులను గూర్చి గాని ఏ విధమైన ప్రస్తావన లేదు. విశిష్టాద్వైత వైష్ణవ మతంలో అంగీకరింపబడే 24 తత్వాలనే పరిపాడల్ మొదలైన సంగ కాలానికి సంబంధించిన గ్రంథాలు పేర్కొంటున్నాయి. శైవంలో చెప్పబడే 36 తత్వాలు సంగసాహిత్యంలో ఎక్కడా చెప్పబడలేదు. సంగకాలలోకూడా వేదాలు భగవానునిచేకూడా నిర్మించబడని, అపౌరుషేయాలైన శాస్త్రాలు అని, భగవంతుడు ఎప్పుడూ తన మనసులో భావించే నిత్యమైన శాస్త్రాలు అని చెప్పబడ్డాయి. శైవ మతంలో వలే వేదాలు ఈశ్వరునిచే రచింపబడినవి అని సంగ కాలానికి సంబంధించిన పండితులు ఎవరు ఒప్పుకోలేదు. ఈ విషయాలనన్నిటిని మేము ఇంతకుముందే "జాతిమత ఆరాయ్ చ్చి, సంగ కాల త్తమిழర్ సమయమ్ "మొదలైన గ్రంథాలలో వివరంగా ప్రస్తావించాము.

ఆళ్వారుల ద్రావిడ వేదం అవతరించడం ప్రారంభించిన తరువాత, శైవాగమాలను, శైవపురాణాలను ఆధారంగా చేసుకుని నాయన్ మార్లు తమ తేవారమ్, తిరువాచకమ్. మొదలైన గ్రంథాలలో శివుడే పరతత్వం అని చెప్పే శైవ మతాన్ని స్థాపించడానికి ముందుకు వచ్చారు. క్రీస్తు శకం 8వ శతాబ్దంలో ఆదిశంకరులు అవతరించి, "జగత్తు మిథ్య, జీవుడు బ్రహ్మం ఒకటే"అనే సిద్ధాంతాన్ని

కలిగిన అద్వైత మతాన్ని వైదిక మతంగా భారతదేశంలో అంతటా వ్యాపింప చేశారు. వైదిక మతం ఏది? అనే విషయంలో కలిగిన ఈ సందేహాలను అన్నిటిని తీర్చడం కోసమే క్రీస్తుశకం తొమ్మిదవ శతాబ్దం నుండి అవతరించిన శ్రీనాథమునులు, శ్రీయామునులు, శ్రీరామానుజులు మొదలైన శ్రీవైష్ణవ పూర్వాచార్యులు తమ న్యాయ తత్వం, సిద్ధి త్రయం, శీభాష్యం మొదలైన గ్రంథాల మూలంగా విశిష్టాద్వైత శ్రీవైష్ణవ మతమే వైదిక మతం అని స్థాపించారు. శ్రీరామానుజులు, వారికి తరువాత అవతరించిన మన పూర్వాచార్యులు నాయన్మార్లు రచించి ప్రచారం చేసిన తేవారం, తిరువాచకం మొదలైన గ్రంథాల కారణంగా ద్రావిడ దేశంలో ఉండే సామాన్య జనంలో "వైదిక మతం ఏది?"అనే విషయంలో ఏర్పడిన సందేహాన్ని తీర్చడం కోసం, తమ శిష్యులను నియమించి, వారి ద్వారా ద్రావిడ వేదాలు అనే దివ్యప్రబంధాలకు ఆ కాలంలో ప్రచారంలో ఉండే మణిప్రవాళ శైలిలో వ్యాఖ్యానాలు అవతరించేటట్లుగా చేశారు. శ్రీరామానుజుల శిష్యులైన శ్రీ తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ నమ్మాళ్వారుల తిరువాయ్ మొழி ప్రబంధానికి ఆఱాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని, వారిని అనుసరించి అవతరించిన శ్రీపరాశర భట్టర్ శిష్యులైన నంజీయర్ ఒన్బదినాయిరప్పడి అనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. నంజీయర్ శిష్యులు నంబిళ్ళై. వార శిష్యులు, శ్రీకృష్ణసూరి అనే నామాన్ని కలిగినవారైన పెరియ వాచ్చాన్ పిళ్లై నాలాయిర దివ్యప్రబంధాలకు అన్నిటికీ అమృతం కంటే తీయని వ్యాఖ్యానాలను రచించి, ద్రావిడ వేద భాష్యకారులు అని అందరి చేత ప్రశంసింపబడే గొప్పతనాన్ని పొందారు.

ఆళ్వారుల ద్రావిడ వేదానికి వ్యాఖ్యానం రచించేటప్పుడు, శ్రీకృష్ణసూరి, అవి అనేక సంస్కృత వేదాల అనువాదం వలె ఉండడాన్ని సప్రమాణంగా నిరూపించి చూపించారు. వేదాలను వివరించడం కోసం అవతరించిన వేదావతారమైన శ్రీరామాయణ వాక్యాలతోనూ, పంచమ వేదమైన మహా భారత వాక్యాలతోనూ,

గీతోపనిషత్ వాక్యాలతోనూ వాటిని సమన్వయించి చూపించారు. తాము అనుగ్రహించిన తనిశ్లోకిగ్రంథంలో శ్రీరామాయణ, మహాభారత గ్రంథాలు ద్రావిడ వేదంలో చెప్పబడిన అర్థాన్ని చెబుతున్నట్లుగా నిరూపించారు. వేదాల సారమైన తిరు మంత్రం, ద్వయం అనే మంత్రాలను ద్రావిడ వేదాలు వివరించడానికి తమ వ్యాఖ్యానంలో విస్తృతంగా వివరించారు. ఇందువల్లనే మిగిలిన ఏ ద్రావిడ గ్రంథానికి లేని "ద్రావిడ వేదం"అని ప్రశంసింపబడే గొప్పతనం ఆళ్వారుల దివ్యప్రబంధాలకు పూర్వాచార్యుల చేత ఇవ్వబడింది అని, ద్రావిడ వేద భాష్యకారులు అనే గొప్పతనం శ్రీకృష్ణసూరికి చాలా తగివున్నది– అని స్పష్టమవుతున్నది.

"పెరియ వాచ్చాన్ పిళ్లై అనుగ్రహించిన వ్యాఖ్యానాలను అన్నిటిని ప్రచురించి ప్రకాశింప చేయాలి, వాటిని ఈ కాలంలో ఉండే ఆస్తికులైన వారందరూ తెలుసుకునేటట్లుగా సులభమైన ద్రావిడ భాషలో వాటికి వివరణలు వెలువడాలి"అనే ఉద్దేశంతో తిరుచినాపల్లిలో చాలా ప్రసిద్ధి చెందిన ఉభయ వేదాంత విద్వాంసులు, మా తండ్రిగారు అయిన శ్రీమాన్ కే. శ్రీనివాస అయ్యంగార్ స్వామివారు ఒక ధార్మిక సంస్థను స్థాపించి, దాని ద్వారా "శ్రీశ్రీనివాసం అచ్చుగమ్"అనే ముద్రణాలయాన్ని స్థాపించి, శ్రీ వైష్ణవ సుదర్శనం అనే మాస పత్రికను ఆరంభించి, నాలాయిర దివ్యప్రబంధ వ్యాఖ్యానాలు అన్నిటికీ సులభమైన ద్రావిడ భాషలో వివరణలు వెలువడడానికి నిరంతరమైన కృషిని చేసి, తగిన ఏర్పాట్లను చేసి, ఐదు సంవత్సరాల కాలం ఆ సంస్థను నిర్వహించారు. వారికి తరువాత దాసుని ఆ కార్యాన్ని నిర్వహించమని నియమించారు. 50 సంవత్సరాలకు పైగా ఈ కైంకర్యం కొనసాగుతూ వస్తున్నది. దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలకు, రహస్య గ్రంథాలకు, గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు అనే ప్రస్థానత్రయానికి ఈ ముద్రణాలయం ద్వారా,

శ్రీవైష్ణవ సుదర్శనం అనే పత్రిక ద్వారా సులభమైన ద్రావిడ భాషలో వివరణను కలిగిన, పలువేల పుటలు కలిగిన పలు పలు గ్రంధాలు ప్రకాశింప జేయబడ్డాయి. ఈ గ్రంథాలు అనేకమార్లు మళ్ళీ మళ్ళీ ముద్రింపబడ్డాయి కూడా.

దాసుడు ముద్రించిన "సంగకాల త్తమిழர் సమయం, జాతి మత ఆరాయ్ చ్చి, శ్రీవిష్ణుచిత్త విజయమ్. తమిழగత్తిల్ తత్తువ శమయ వళర్ చ్చి"మొదలైన ఎన్నో గ్రంథాలద్వారా ద్రావిడ దేశంలో 2000 సంవత్సరాలకు ముందు విశిష్టాద్వైత మత శ్రీవైష్ణవ మతమే వైదిక మతంగా పూర్వులచేత పరిగ్రహింపబడింది అనే వాస్తవాన్ని పలు ద్రావిడ సంస్కృత గ్రంథాలలో గోచరించే ఆధారాలను చూపించి, నిరూపించడం జరిగింది. ఆర్య ద్రావిడ భేదం అనేది ఆంగ్లేయులు కల్పించినది – అనే వాస్తవాన్ని పలు ద్రావిడ సంస్కృత గ్రంథాలలోని ఆధారాలను చూపించి, వివరించడం జరిగింది. ద్రావిడ దేశం ఉత్తర భారతదేశం అనే తేడా లేకుండా, మతం, సంప్రదాయం మొదలైన వాటిలో ఐకమత్యంతోనే మన భారత జాతి వర్తించింది అనే సత్యాన్ని గ్రంథాలలో నిరూపించడం జరిగింది. అవి ఎవరిచేత నిరాకరింపబడలేదు.

మన స్నేహితులు, మద్రాస్ మహానగరంలోనూ, ఇక్కడ పెరియ వాచ్చాన్ పిళ్లైకు గొప్ప ఉత్సవాన్ని జరుపుతున్నవారైన శ్రీ ఉ. వే. శ్రీమాన్ ఏ కృష్ణమాచార్యులవారు శ్రీవైష్ణవశ్రీ అనే సంస్థను స్థాపించారు. దీనిద్వారా ఈ గ్రంథాలను ఇంకా ఇంకా వారు పలుమార్లు ముద్రించే వైభవం రాబోయే కాలంలో తప్పక సంభవిస్తుంది అనేది నిశ్చయం.

(విన్నపం – ఈ వ్యాసకర్త పరిపాడల్ మొదలైన ద్రావిడ గ్రంథాలనుండి కూడా పలు ప్రమాణ వాక్యాలను ఉదాహరించారు. వాటిని, తెలుగు పాఠకులకు గ్రహించడం కష్టం అనే భావంతో వాటిని ఈ వ్యాసంలో గ్రహించడం జరుగలేదు.)

★★★★★

# ఆళ్వారులు కొనియాడిన ద్రావిడభాషావైభవం

ఆళ్వారులు అందరూ తీయని ద్రావిడభాషలో తమ దివ్యప్రబంధాలను అనుగ్రహించారు. వారు ద్రావిడదేశంలో జన్మించినవారు కనుక, తమ మాతృభాష అయిన ద్రావిడభాషను అభిమానించడం, దానిని కీర్తించడం సహజం. మాత, మాతృభూమి, మాతృభాష అంటే ఎవరికి అభిమానం ఉండదు కనుక! ఆళ్వారులు తమ దివ్యప్రబంధాలలో తమను ద్రావిడభాషావేత్తలుగా నిర్దేశించుకోవడం, ద్రావిడభాషావైభవాన్ని నోరార కీర్తించడం పలు సందర్భాలలో గోచరిస్తుంది. ఈ విషయంలో సంగ్రహంగా కొన్ని ఉదాహరణలను గమనిద్దాం.

ముదలాళ్వార్లు అని పేరు పొందిన సరోయోగి, భూతయోగి, మహాయోగి అనే ముగ్గురిలో, రెండవవారైన పూదత్తాళ్వారులు అనే భూతయోగి తమ రెండవ తిరువందాది ప్రబంధంలో ఒకచోట, 74వ పాశురంలో శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి

"యానే ఇరుమ్ తమి**ழ்** నన్మాలై ఇణైయడిక్కే శొన్నేన్,
పెరుమ్ తమి**ழ**నల్లేన్ పెరిదు"

(నేనే, లక్షణాలతో పూర్ణంగా ఉండే, ద్రావిడ భాషలో విలక్షణమైన పాశురమాలికను భగవంతుని శ్రీచరణాలు రెండిటిలో పాడి సమర్పించాను. నేనే గొప్ప ద్రావిడపండితుడను, మిక్కిలి గొప్పవాడను అయ్యాను) అని అన్నారు.

తాము గొప్ప ద్రావిడ పండితులమని, తాము చెప్పిన పాశురమాలిక చాలా విలక్షణమైనదని, లక్షణపూర్ణమైనదని పూదత్తాళ్వారులు అనగానే, శ్రీవేంకటేశ్వరుడు వెంటనే "ఆళ్వారులూ! మీరు చాలా గొప్ప ద్రావిడపండితులమని అంటున్నారే! ఆ భాషలో చాలా గొప్పగా పాశురాలను చెప్పగలమని అంటున్నారే! ఆ విధంగా

అయితే, ఒక చక్కని ద్రావిడపాశురాన్ని చెప్పండి, వింటాను “అని అన్నాడట. వెంటనే 75 వ పాశురాన్ని పూదత్తాళ్వార్లు ఈ క్రింది చెప్పారు.

“పెరుగు మదవేழమ్ మాప్పిడిక్కు మున్నిన్ఱు
ఇరుకణ్ ఇళమూంగిల్ వాంగి–అరుకిరుంద
తేన్ కలందు నీట్టుమ్ తిరువేంగడమ్ కండీర్,
వాన్ కలంద వణ్ణన్ వరై.”

గొప్ప ఆడ ఏనుగుకు ఎదురుగా నిలచి, రెండు కణుపులను కల లేత వెదురును విరచి, దగ్గరలో ఉండే తేనెలో దానిని ముంచి, తొండంతో దానిని చాచి, ఆడ ఏనుగుకు ప్రేమగా ఇచ్చే, మదజలం కారే మగ ఏనుగులు కలిగిన గొప్ప వేంకటాచలమే కదా, మేఘసమానవర్ణుడైన శ్రీనివాసభగవానుడు నివాసం చేసే కొండ.

ఈ పాశురంలో, తిరుమల కొండపై గోచరించే, సహజసిద్ధమైన రామణీయకాన్ని స్వభావోక్తి పురస్సరంగా అందంగా వర్ణించే కవితా సౌందర్యం ఒకవైపు ప్రకాశిస్తూ ఉండగా, వేరొక వైపు, ఆళ్వారులు శ్రీరామానుజావతారానికి చెందిన భవిష్యద్దర్శనవైభవం కూడా సూచింపబడింది. ఏ విధంగా? అంటే,

ఈ పాశురంలో ప్రస్తావింపబడిన మగ ఏనుగు ఎవరో కాదు, భగవద్రామానుజులే. పూదత్తాళ్వారులు ద్వాపరయుగం చివరిలో అవతరించారు. ఆ తరువాత, చాలాకాలం గడచిన తరువాత సుమారు నాలుగు వేల సంవత్సరాలకు అనంతరం, భగవద్రామానుజులు కలియుగంలో అవతరించబోతారు, తిరుమల కొండపైకి, వేంచేసి అక్కడ, వేదార్థసంగ్రహం అనే శ్రుతివాక్యసమన్వయ రూపమైన గ్రంథాన్ని ఉపన్యాసరూపంగా అనుగ్రహించబోతారు– అనే సంగతిని ఈ పాశురంలో పూదత్తాళ్వారులు సూచించారు– అని పెద్దల సమన్వయం.

ఇక్కడ పాశురంలో చెప్పబడిన లేత చెరకు అంటే, శ్రుతివాక్యాలే. వీటికి రెండు కణుపులు ఉండడం అంటే, ఆ వాక్యాలు రెండు విధాలుగా ఉండడం. వేదంలోని కొన్ని వాక్యాలు జీవాత్మ పరమాత్మల భేదాన్ని తెలిపేవిగాను, మరికొన్ని అభేదాన్ని తెలిపేవిగాను ఉన్నాయి. పరస్పర అ విరుద్ధంగా తోచే ఈ రెండు విధాలైన వాక్యాలను భగవద్రామానుజులు జీవాత్మ, పరమాత్మల మధ్య శరీరశరీరిభావాన్ని తెలిపే ఘటశ్రుతులను పురస్కరించుకొని మధురంగా సమన్వయం చేశారు. అందుచేత ఈ ఘటకశ్రుతులే తేనె. తిరుమలలో, , చెరకు గడను తేనెలో ముంచి, దగ్గర ఉండే ఆడ ఏనుగుకు మగ ఏనుగు సాదరంగా ఇవ్వడం అంటే, అర్థంలో పరస్పర విరుద్ధంగా తోచే రెండు విధాలైన వేదవాక్యాలను ఘటకశ్రుతులతో సమన్వయం చేసి, మగ ఏనుగువంటి శ్రీరామానుజులు ఆడ ఏనుగుల వంటి తమ శిష్యులకు మధురంగా వివరించి, బోధించడమే.

భగవద్రామానుజులు తిరుమలకొండపై శ్రీవేంకటేశ్వరుని దివ్యాలయానికి ఎదురుగా ఉండే బేడి ఆంజనేయ స్వామి కోవెలకు ఎదురుగా ఉన్న మండపంలో వేదార్థసంగ్రహం అనే శ్రుతివాక్యసమన్వయ రూపమైన గ్రంథాన్ని ఉపన్యాస రూపంగా శిష్యులకు అనుగ్రహించారని, తరువాత అది గ్రంథరూపాన్ని సంతరించుకున్నదని వారి చరిత్రలో చెప్పబడుతున్నది. కలియుగంలో భవిష్యత్తులో జరగబోయే ఈ సందర్భాన్ని పూదత్తాళ్వారులు తమ దివ్యదర్శనంతో దర్శించి, ఈ పాశురంలో అలంకారికమైన శైలిలో అనుగ్రహించడం చాలా అద్భుతంకదా. అందువల్లనే వారు "పెరుమ్ తమిழన్"అయ్యారు. ఈ పేరుతో శ్రీవేంకటేశ్వరుడు అనుగ్రహించాడు కూడా.

ముదలాళ్వార్లలో మూడవ ఆళ్వార్లు పేయాళ్వార్లు. వీరికి "తమిழ் తలైవన్"అని పేరు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఈ నామంతో ప్రసిద్ధులైన ఆళ్వార్లు వీరే. తిరువరంగత్తముదనార్ ఇరామానుశ నూత్తందాది దివ్యప్రబంధంలో ఈ ఆళ్వార్లను స్తుతిస్తూ,

"మన్నియ పేరిరుళ్ మాండ పిన్ కోవలుళ్ మామలరాళ్

తన్నొడు మాయనై క్కండమై కాట్టుమ్ తమిழ் తలైవన్"(10)

(తొలగించటానికి సాధ్యం కాని విధంగా పేరుకుపోయి ఉండే చాలా దట్టమైన అజ్ఞానమనే చీకటి సరోయోగి, భూతయోగి అనే ఇద్దరు దివ్యసూరులు వెలిగించిన రెండు దివ్య ప్రబంధాలు అనే గొప్ప దీపాలవల్ల పూర్తిగా నశించగా, తిరుక్కోవలూరు అనే దివ్యక్షేత్రంలో, వికసించిన తామర పువ్వులలో నివసించే మహాలక్ష్మితో కూడా కలసి ఉండే ఆశ్రితసులభుడైన సర్వేశ్వరుని తాము సాక్షాత్కరించుకున్న రీతిని తమ దివ్యప్రబంధంలో అభివర్ణించి, మనకు దర్శింపజేసిన ద్రావిడ మహాకవులలో అగ్రగణ్యులైన పేయాళ్వార్లు) అని "తమిழ் తలైవన్" అనే బిరుదంతో కీర్తించారు.

నమ్మాళ్వారుల సూక్తులను గమనించినట్లయితే, వారు తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలో ఒక చోట ఈ ముదలాళ్వార్లను ముగ్గురిని "పాలేయ్ తమిழర్ ఇశైకారర్ పత్తర్"అని వరుసగా కీర్తించారు. ఇక్కడ "పాలేయ్ తమిழర్"అంటే– పాలవంటి మధురమైన ద్రావిడ భాషలో పాశురాలను పాడగలిగినవారు– అని అర్థం. వారు – సరోయోగి, భూతయోగి, మహాయోగి అనబడే పొయ్ గై ఆళ్వారులు, పూదత్తాళ్వారులు, పేయాళ్వారులే– అని మన పూర్వాచార్యుల వివరణం.

ఈ విధంగా నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలో ఇంకా పలుచోట్ల ద్రావిడభాషావైభవాన్ని ప్రశంసించారు. తిరువాయ్ మొழி ప్రబంధంలో వారు కేవలం భగవంతునకు ద్రావిడ పాశురాలను పాడినట్లుగా మాత్రం చెప్పలేదు, అందమైన ద్రావిడ భాషలో పాశురాలను పాడినట్లుగా చెప్పారు. ఆ ప్రబంధంలో ఒకచోట (7–9–1) "ఎన్నాల్ తన్నై ఇన్ తమిழ் పాడియ ఈశనై"అని అన్నారు. కేవలం భగవంతుడు తనను కీర్తించేటట్లుగా చేశాడు– అని మాత్రం వారు చెప్పలేదు, మధురమైన ద్రావిడ భాషలో పాశురాలను పాడేటట్లుగా తమను చేశాడు –అని అన్నారు. ఆ ప్రబంధంలోనే ఇంకొక చోట (4–5–10) , "వణ్ తమిழ் నోఱ్ఱ నోற்றேన్ అడియార్ క్కు ఇన్బమారియే"అని అన్నారు. అంటే, "భగవంతుని చాలా అందమైన సారవంతమైన ద్రావిడ భాషలో కీర్తించగలిగిన నోమును నోచాను, ఎటువంటి వాక్యాన్ని నేను పొందాను కదా! "అని అన్నారు. ఆ విధంగానే ఆ ప్రబంధంలోనే మరి ఒక చోట (10–6–4) "ఎన్నెఞ్జత్తుళ్ ఇరుందు ఇంగు ఇరుమ్ తమిழ் నూలివై మొழிన్దు"అని అంటూ "చాలా అందమైన, చాలా గొప్పదైన ఈ ప్రబంధాన్ని పలికేటట్లుగా భగవంతుడు నన్ను చేశాడు "అని అన్నారు. ఈ విధంగా తమ తిరువాయ్ మొழி ప్రబంధానికి నమ్మాళ్వారులు పెట్టిన పేరు ఏమంటే, "ఇరుమ్ తమిழ் నూల్" అనేది. ఆ తరువాత, శ్రీమన్నాథమునులు నాలాయిర దివ్యప్రబంధాలను క్రమంలో కూర్చేటప్పుడు, ఈ ప్రబంధానికి తిరువాయ్ మొழி అనే పేరును పెట్టారు తప్ప, ముందుగా నమ్మాళ్వార్లు తమ ప్రబంధానికి తాము పెట్టిన పేరు ఇదే.

ఇందువల్లనే నమ్మాళ్వారుల శిష్యులైన మధురకవులు కణ్ణినుణ్ శిఱుత్తాంబు అనే తమ ప్రబంధంలో "అరుళ్ కొండాడుమ్ అడియవర్ ఇన్బుఱ– ఆయిరమ్ ఇన్

తమిళ్ పాడినాన్"అని అంటూ మధురమైన ద్రావిడభాషలో తిరువాయ్ మొళి ప్రబంధాన్ని పాడినట్లు కీర్తించారు.

ఈ విధంగా వీరందరి సూక్తులు ఒకవైపు ఉండగా, కులశేఖరాళ్వారుల సూక్తి మరింత విలక్షణమైనది. వారు తమ పెరుమాళ్ తిరుమొళి దివ్యప్రబంధం ఆరంభంలో శ్రీరంగంలోని శ్రీరంగనాథుని కీర్తించే దశకాన్ని పాడారు. ఆ దశకంలో వారు శ్రీరంగనాథుడు వేంచేసి ఉండే అందాన్ని గురించి కీర్తిస్తూ, నాలుగవ పాశురంలో "అందమిళ్ ఇన్బ ప్పావినై"అని అన్నారు అంటే అందమైన ద్రావిడ భాషలో ఒక పాశురం ఉంటే అది ఎంత మధురంగా ఉంటుందో, అంత మధురంగా శ్రీరంగనాథుడు వేంచేసి ఉన్నాడు– అని అన్నారు. ఇక్కడ ఈ ఆళ్వారులు ద్రావిడ భాషామాధుర్యాన్ని శ్రీరంగనాథుని మాధుర్యంతో పోల్చి చెప్పారు అంటే. వారికి ద్రావిడభాషపై ఉండే మక్కువ ఎంతటిదో గమనించవచ్చు.

తరువాత, పెరియాళ్వారుల సూక్తులలోని విశేషాలను ఒకటి, రెండు గమనిద్దాం. మధుర ప్రాంతంలో వ్యవహరింపబడే ద్రావిడభాషలోని సౌందర్యం ద్రావిడ భాషావేత్తలకు అందరికీ తెలిసినదే. అందువల్ల ఆ ప్రాంతంలో పుట్టి పెరిగిన ఆ ఆళ్వారులకు ద్రావిడ భాషపై ఎంతటి ప్రీతి ఉంటుందో మనం కొంతవరకు ఊహించవచ్చు కదా. వారు తమ ప్రబంధంలో ఒకచోట "తణ్ పుదువై పట్టన్ శొన్న తూయ తమిళ్ పత్తు "(3–8–10) అని అన్నారు ఇక్కడ ద్రావిడ భాషను "తూయ"అనే విశేషణంతో విశేషించి పలికారు. ఈ విశేషణంలో ఉండే తాత్పర్యాన్ని శ్రీమణవాళ మహామునులు తమ వ్యాఖ్యానంలో వివరించి పలుకుతూ, ఈ విధంగా అన్నారు. "ఏ భాష చదివేవారి మనసులో అర్థం సులభంగా గ్రహించడానికి సౌకర్యంగా ఉంటుందో, ఆ భాష "తూయ"అని చెప్పదగినది– అని, సంస్కృత భాష

వలె అర్థం తెలుసుకోవడానికి చాలా కష్టంగా ఉండే రీతిలో కాకుండా, సామాన్యులకు అల్పజ్ఞులకు కూడా అర్థం సులభంగా గ్రహించడానికి వీలుగా ఉండేటట్లుగా ద్రావిడభాష ఉంటుంది కనుక, అది "తూయ తమిழ் "అని ఆళ్వారులు విశేషించి పలికారు– అని వారు అన్నారు. (ఇక్కడ న హి నిందా న్యాయాన్ని అన్వయించుకోవాలి. ఇది కేవలం ద్రావిడ భాషావైలక్షణ్యాన్ని చెప్పడం కోసం చేసిన వివరణ తప్ప, సంస్కృత భాషను తక్కువగా భావించి చెప్పిన వివరణ కాదు అని గ్రహించాలి)

ఈ విధంగానే, ఈ అళ్వారులు తమ ప్రబంధంలోని నీరాట్టమ్ దశకంలో "కార్మలి మేని నిఱత్తు కణ్ణపరాసై ఉగందు, –– యశోదై మంజన మాట్టియ వాற்றை, ––– పట్టర్ పిరాన్ శొన్న పాడల్ శీర్ మలి శెందమిழ்"అని అన్నారు. ఇక్కడ "శీర్మలి శెందమిழ்"అంటే ఏమి అర్థం? "శీర్మై, శెమ్మై"అనే గుణాలను నిండుగా కలిగిన ద్రావిడ భాష – అని అర్థం. ఈ రెండు గుణాలను వ్యాఖ్యానిస్తూ శ్రీవరవరమునులు భాషాలక్షణాలను పూర్ణంగా కలిగిన, ఋజువైన ద్రావిడ భాష అని అన్నారు. గొప్పదైన లక్షణపూర్తిని కలిగిన భాష, ద్రావిడ భాష – అని దీని తాత్పర్యం. ద్రావిడ భాషవలె లక్షణపూర్తిని కలిగిన భాష వేరొకటి లేదు– అని ద్రావిడ భాషను ప్రశంసిస్తూ చేసిన ప్రయోగం ఇది.

పెరియాళ్వారులు ఈ విధంగా ద్రావిడ భాషను ప్రశంసించినప్పుడు, వారి ప్రియ పుత్రిక అయిన గోదాదేవి ఆ భాషను కీర్తించకుండా ఉంటుందా? ఆండాళ్ అంటే, "పరిపాలించినది"అని అర్థం. ఆమె శ్రీరంగనాథుని తాను ముడుచుకొని సమర్పించిన పూమాలికతో వశం చేసుకొని, అతని హృదయాన్ని పాలించింది. అంతే కాదు, ద్రావిడ భాషను కూడా అందంగా నిర్వహించింది. అందువల్ల ఆండాళ్ అనే

సార్థక నామధేయాన్ని పొందినది అయినది. ఆమె అందమైన ద్రావిడ భాషలో 30 పాశురాలను కలిగిన తిరుప్పావై ప్రబంధాన్ని పాడినది. దానిని మన పెద్దలు "కోదైతమిళ్"అని కీర్తించారు. ఈ ప్రబంధానికి తరువాతి కాలంలో నాథమునులు తిరుప్పావై అనే నామధేయాన్ని పెట్టారు. అయితే, మొదటగా గోదాదేవి తన ప్రబంధానికి ఏ పేరును పెట్టింది? అని గమనించి చూసినప్పుడు, ఆమెయే స్వయంగా తిరుప్పావై ప్రబంధంలోని చివరి పాశురంలో "శంగ త్తమిళ్ మాలై "అనే పేరును పెట్టింది– అని స్పష్టపడుతుంది కదా. తిరుప్పావై ప్రబంధానికి గోదాదేవి పెట్టిన పేరు ఇది.

ఆ విధంగానే తన రెండవ ప్రబంధం అయిన నాచ్చియార్ తిరుమొళిలో "వారణమాయిరమ్"అనే దశకంలో చివర "వేయర్ పుగళ్ విల్లిపుత్తూర్ కోన్ కోదైశొల్ తూయ తమిళ్ మాలై"అని అంటూ ద్రావిడ భాషను "తూయ తమిళ్"అనే పదంతో విశేషించి పలికింది.

ఇక, ఈ విషయంలో చివరిగా చివరి ఆళ్వారులు అయిన తిరుమంగై ఆళ్వార్ల సూక్తులను గమనిద్దాం. ఈ ఆళ్వారుల సూక్తులలో గాంభీర్యం, వైలక్షణ్యం ఉంటుంది. అందువల్లనే వీరికి "కలియన్"అనే సార్థమైన పేరు వచ్చింది. కలి అంటే బలం – అని అర్థం. కలియన్ అంటే బలం కలిగినవాడు– అని అర్థం. చక్కని ద్రావిడ భాషను ఉపయోగించి, పాశురాలను పలుకడంలో ఈ ఆళ్వార్లు చాలా సమర్థులు. వారు, తిరునెడుందాండగకమ్ అనే ప్రబంధంలో (4) ఒకచోట "శెందిఱత్తై తమిళ్ ఓశై వడశొల్లాగి"అని అన్నారు. ఏ విధంగా సంస్కృత వేదం భగవంతుని నుండి వ్యక్తం అయినది అని అంటున్నామో, ఆ విధంగానే ద్రావిడ వేదం, ద్రావిడ భాష కూడా

దివ్యమైనవి, అనాది అయినవి, ఆళ్వారులు అనుగ్రహించిన పాశురాలు అన్ని ఆ భగవంతుని వల్లనే వ్యక్తమైనవి – అని ఇక్కడ తాత్పర్యం. ఇక్కడ విశేషం ఏమంటే, ఆళ్వారులు ముందుగా ద్రావిడ వేదాన్ని ప్రస్తావించడం. ఇది ఈ ఆళ్వారులకు ద్రావిడభాషా విషయంలో ఉండే ఆదరాతిశయాన్ని సూచిస్తున్నది.

ఇదే విధంగా, ఒకచోట, "ఇరుమ్ తమిழ் నూల్ పులవన్"అని తమను నిర్దేశించుకున్నారు. ఇంతకు ముందు నమ్మాళ్వారులు తమ తిరువాయ్ మొழி దివ్యప్రబంధాన్ని "ఇరుమ్ తమిழ்"అని కీర్తించారని చూశాము కదా. అటువంటి గొప్ప ఆ ప్రబంధాన్నితాము అధ్యయనం చేశాము. ఆ ప్రబంధంలో తాము చాలా సమర్థులము"– అని ఈ విధంగా కలియన్ తెలియజేశారు.

ఈ విధంగా అళ్వార్లు అందరూ భగవంతుని విషయంలో అంతు లేని అభినివేశాన్ని కలిగినవారు. భగవద్భక్తిలో అవగాహించి పాశురాలను పాడినవారు. అయితే, వారు పాశురాలను ఏ ద్రావిడ భాషలో పాడారో, ఆ భాషను చాలా విశేషంగా తమ ప్రబంధాలలో కీర్తించారు. అందువల్లనే ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో శ్రీవరవరమునులు ఆళ్వార్లను అందరినిగూర్చి పలుకుతూ "అందమిழாల్ నఱ్కలైకళ్ ఆయ్ న్దురైత్త ఆழ்వార్ కళ్"(అందమైన ద్రావిడభాషలో గొప్ప శాస్త్రరూపాలైన వేదాలను దివ్యప్రబంధాల రూపంలో అనుగ్రహించినవారు) అని, సామాన్యులు అర్థం చేసుకోవడానికి కఠినంగా ఉండే సంస్కృత వేదాలను తీయని అందమైన ద్రావిడ భాషలో, మనకు ఆళ్వారులు ప్రసాదించారు– అని అన్నారు. ఇది ఆళ్వారులకు ద్రావిడభాషపట్ల ఉండే గొప్ప అభినివేశాన్ని తెలుపుతుంది.

★★★★★